# శ్రీ సనత్సుజాతీయము



అనువాదం

R. సుబ్బరత్నమ్మ

ప్రథమముద్రణ 1997

గీతాజయంతి

ప్రతులు 750



మూల్యము , **25/-**

ప్రతులకు ,

శ్రీమతి **A. G.** జ్ఞానప్రసూన, M.A., B.Ed.,
" స్థిత ప్రజ్ఞ "
4-6-28, రిజర్వాయర్ కాలనీ, తిరుపతి.

ముద్రణ :

మంజునాధ ప్రింటర్స్
151-C, సాయిరాం వీధి, తిరుపతి,

H. H. Amrutananda Swamiji Maharaj,
*Ramakrishna Mutt, Mylapore, Madras.*

Sanatsujatiya is the teaching of Sanatsujata, one of the mind-born sons of Brahma. Dhritarashtra is filled with fear of death and is badly in need of soothing advice to gain mental peace. Vidura talks to the despondent king about various dharmas (duties) But Dhritarashtra asks Vidura to say something more He wants something to calm his troubled heart. Vidura invokes Sanatsujata to teach Dhritarashtra about the ultimate goal of human life. He asks Sanatsujata to explain his philosophy that there is no death. Sanatsujata tells him that he did not mean to say that there was no death. Inadvertance itself is death. There is no other death.

what exactly is this inadvertance (Pramaada) is the subject matter of the teaching and its key-statement is inadvertance is death. (Pramaadovai mrutyumaham bravimi) Advertance is ons's being conscious of one's self. Inadvertance is its opposite. It makes us aw-
--- of many things of the world. This is death a recurring
One who is self-conscious is immortal, This
n the teaching of Sanatsujata.
oduction to vedanta and deser-

# ని వే ది న

శ్రీ శిరోమణి సముద్రాల లక్ష్మణయ్య, M A.
Retd. కార్యదర్శి ధర్మ ప్రచారపరిషత్.
తి తి దే. తిరుపతి.

"యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్క్వచిత్"

అన్న సూక్తి మహాభారతం పట్ల అక్షరాలా నిజం అందులో మానవ జాతి గ్రహించ వలసిన అన్ని విషయాలూ నిరూపింపబడ్డాయి.

తెలుసుకో దగిన అంశాలన్నింటిలోనూ తలమానిక మనదగింది అధ్యాత్మత త్త్వం అందుకే శ్రీ కృష్ణుడు గీతలో "అధ్యాత్మ విద్యా విద్యానాం" "విద్యలలో నేనధ్యాత్మ విద్యను" అని చెప్పాడు భారతాం తర్గతమై సమస్త వేదార్థసారసంగ్రహంగా రూపొందిన భగవద్గీత అతి విస్తృత వ్యాప్తి పొందింది అది భీష్మ పర్వంలోని భాగం.

ఉద్యోగ పర్వంలో నిబద్ధమైన సనత్సుజాతీయం కూడా తత్త్వార్థ ప్రతి పాదకమే. ఇక్కడ శ్రోత ధృతరాష్ట్రుడు, వక్త సనత్సుజాతుడు వీరిదువురి సంవాదరూపంగా కొనసాగిన ఆరు అధ్యాయాల గ్రంథ భాగమే సనత్సుజాతీయం.

విదురుడు తాను బోధిస్తేత త్త్వం ధృతరాష్ట్రునికి చక్కగాపట్టదు అని భావించి కాబోలు తాను శూద్రయోనిజుడనన్న వ్యాజంతో తప్పు కొని బ్రహ్మయోనిజుడైన సనత్సుజాతుని ద్వారా త త్త్వం బోధింప జేశాడు. అయినా ఈ ప్రబోధం ధృతరాష్ట్రుణ్ణి సమగ్రంగా స్పందింప జేయలేక పోయిందనడానికి తరువాతి అతని చరిత్రే నిదర్శనం.

మానవుణ్ణి అన్నింటికంటే ఎక్కువగా భయపెట్టేది మృత్యువు మృత్యు రహితమైన ఆత్మ తత్త్వాన్ని వివరించడానికే కఠోపనిషత్తు, భగవద్గీత మొదలైన గ్రంథాలు వెలువడ్డాయి. ఆత్మత త్త్వం బోధపడితే మృత్యుత త్త్వం కూడా బోధపడినట్లే.

అసలు మృత్యువనేదే లేదనీ, ప్రమాదమే మృత్యువన్న పేరుతో చలామణీ అవుతున్నదనీ, అప్రమాదమే అమృతత్వమనీ సనత్సుజాతుడు ఈ గ్రంథంలో ప్రబోధించాడు పెద్దపులిలాగా మృత్యువు ఎవరినీ భక్షించదు, దానికి రూపమే లేదని కూడా చెప్పాడు.

ఆయన ఈ తత్త్వం వివరించినప్పుడు ధృతరాష్ట్రుడు దీనికను బంధంగా ఎన్నోవిషయాలు అడిగాడు. బ్రహ్మమానస పుత్రుడు అన్నింటికీ ఉచితమైన సమాధానా లిచ్చాడు

సనత్సుజాతుని ప్రబోధం చాలా అర్థవంతమయింది. అందులో ఎన్నో మార్మికమైన విషయాలున్నాయి విపుల వ్యాఖ్య లేకుంటే అందలి తత్త్వం గోచరించదు అందుకే శ్రీ శంకర భగవత్పాదుల వంటి మహా మహులు ఈ గ్రంథానికి భాష్యాలు వ్రాశారు.

సనత్సుజాతీయం గీతలాగా బహుళ ప్రచారం పొందలేదు, అందలి జటిలత్వమే ఇందుకు కారణం కావచ్చు ముఖ్యంగా తెలుగులో ఈ గ్రంథాన్ని వివరిస్తూ వచ్చిన వ్యాఖ్యల సంఖ్య అతి స్వల్పమే

మాతృశ్రీ సుబ్బరత్నమ్మ గారు ఈ గ్రంథ గౌరవాన్ని గుర్తించి దీన్ని అనువదించటం ముదావహం అనువాదంతో పాటు తగినంత వివరణ కూడా వారు వ్రాశారు, నాతి విస్తరంగా సనత్సుజాతీయతత్త్వాన్ని గ్రహించగోరేవారికి ఈ గ్రంథం ఎంతో ఉపయోగపడుతుంది దీని ఉపయోగాన్ని గ్రహించి తిరుమల-తిరుపతి దేవస్థానం వారు ఈ గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయం చేశారు.

మాతృశ్రీ సుబ్బరత్నమ్మగారి వంశం పరమపావనమైనది వారికి ఆధ్యాత్మికం వెన్నతో బెట్టిన విద్య. ఆ విద్యను సఫలం చేస్తూ వారి గ్రంథాన్ని పాఠకులకు ప్రసాదించారు, అమ్మగారి కృషికి జిజ్ఞాసువులైన పాఠకులందరూ హర్షిస్తారనడంలో సందేహం లేదు.

తిరుపతి

16-12-97 — సముద్రాల లక్ష్మణయ్య

# ఇందులో

మృత్యువు కలదా? లేదా? : మృత్యువు పెద్దపులి వంటిదా? పరమాత్మ జగత్తును సృష్టించి, అందులో అతను ప్రవేశించె నేని, అతనికి కలుగు లాభామేమి? : పాపకర్మలు పుణ్య ఫలముల పరిహరించునా లేక పుణ్య కర్మలు పాప ఫలముల పరిహరించునా? మౌనమనగా నేమి? వేదపరన ము వల్ల పాపాత్ముడు రక్షింప బడతాడా? తపస్సు ఎన్ని విధములు?— మదదోషములేవి? దమ దోషములేవి? బ్రాహ్మణుడెవరు? బ్రహ్మ విద్య అనగా నేమి?— బ్రహ్మ చర్యమెట్లు కలుగును?— బ్రహ్మమనగా నేమి? దాని నెట్లు పొంద వచ్చును?—

ఇటువంటి ధృతరాష్ట్రుని ప్రశ్నలకు
సనత్సుజాతుల వారి సమాధానాలిందు గలవు :—

శ్రద్ధగా చదవండి.

మహాత్ముల నాశ్రయించి, వారిని సేవించి,
సందేహముల నివర్తి చేసుకొని

శాంతిని పొందండి.

పవని వేణుగోపాల్

# కృతజ్ఞతలు

భక్తానామఖిలేష్టదం । కలియుగప్రత్యక్షదైవోత్తమమ్ ॥
కారుణ్యామృతవారిరాశిమనిశం । శ్రీ వేంకటేశంభజే ॥

తిరుమల-తిరుపతి దేవస్థానము వారు రచయితల కొసగు ఆర్థిక సహాయపథకము ప్రకారము ఈ గ్రంథ ముద్రణకు సహాయము నందించిరి.

T.T.D. కార్యనిర్వహణాధికారి శ్రీ M.K R. వినాయక్, IAS గారికి, సప్తగిరి సంపాదకులు శ్రీ N.S. రామమూర్తి M A. గారికీ కృతజ్ఞతాంజలులు.

అర్థించిన వెంటనే తమ అమూల్య అభిప్రాయముల నంద జేసిన రూపుదాల్చిన శ్రీరామకృష్ణ బోధామృతానందులు శ్రీశ్రీశ్రీ స్వామి అమృతానంద మహరాజ్, రెక్టార్ – రామకృష్ణమిషన్ – వివేకానంద కళాశాల, మైలాపూర్ మద్రాస్ గారికి, అధ్యాత్మ విద్యావినయసంపన్నులై బహుభాషా పండితులై, ధర్మప్రచార బద్ధకంకణులైన శ్రీ శిరోమణి సముదాల లక్ష్మణయ్యా గారికీ, ఈ గ్రంథ రచనకు అమూలాగ్రము సహాయసహకారాలు అందించి, మార్గదర్శిగా రచన చేసి చేయించిన మా శ్రీవారు శ్రీ పవని వేణుగోపాల్ గారికీ ఈ గ్రంథము యొక్క వ్రాతప్రతిని వ్రాసి పెట్టిన గాయకురాలు, వక్త, శ్రీ విద్యాపాసకురాలు అయిన నా కుమార్తె శ్రీమతి A.S. జ్ఞానప్రసూనకూ, ముఖచిత్రమును సుందరంగా చిత్రించి యిచ్చిన నవయువ దంపతులు రూపాజగదీశ్ గార్లకూ ఏ ఇబ్బందీ కలుగకుండా, అసక్తితో, భక్తిశ్రద్ధలతో ఈ గ్రంథ ముద్రణ అతి త్వరగా పూర్తిచేసిన శ్రీ మంజునాథ ప్రెస్ సోదరులు శ్రీ B. వేణుగోపాల్ శ్రీ B. లక్ష్మీప్రసాద్‌లకు మా మనః పూర్వక కృతజ్ఞతలు

బుధజనవిధేయురాలు

సుబ్బరత్నమ్మ

ఓం

# ప్రవేశము

శ్రీమహాభారతము విజ్ఞాన మహాసాగరము, దీనియందు గల సనత్సుజాతీయము, భగవద్గీత, విష్ణుసహస్రనామస్తోత్రము భీష్మస్తవ రాజము, అనుగీత–ఇవి పంచరత్నములు. ఇవి బ్రహ్మవిద్యా ప్రతిపాదక ము లు, భారతీయతత్త్వశాస్త్రసారములు. శ్రీశంకరభగవత్పాదుల వారు మొదటి మూటికీ భాష్యాన్ని వ్రాసి యున్నరు. దానిని బట్టి సనత్సుజాతీ యము యొక్క విలువ ఎంతటిదో ఎరుగ వచ్చును.

శ్రీ సనత్సుజాతీయము వ్యాసభారతము నందలి ఉద్యోగ పర్వము నందలిది. ప్రజాగర పర్వము తరువాత వచ్చు సనత్సుజాత పర్వముగా యున్నది సంజయుడు పాండవుల కడకు రాయబారము పోయివచ్చి పాండవుల గొప్పదనమును శ్లాఘించి,ధృతరాష్ట్రుని నిందించి, మర్నాడు రాయబార విషయమంతయు చెప్పెదనని పోయెను. ధృతరాష్ట్రుని అపరాధము వలననే కురువంశము క్షయము కాగలదని తీవ్రముగా హెచ్చరించెను. ఆమాటలు వినిన రాజుకు నిద్రపట్టలేదు. హృదయమున భయము జొరబడినది. విదురుని పిలిచితనవ్యథను పోగొట్టు ధర్మమును బోధింపుమనెను.

విదురుడు పెక్కుధర్మముల బోధించెను. అయి నను మనశ్శాంతి కుదర లేదు. బ్రహ్మ విద్యచేతనే గాని మనశ్శాంతి కుదురదు. అందు చేత శంఖంతో పోస్తేనే తీర్థమవుతుందని అనుకొన్నడేమో బ్రహ్మమానస పుత్రుడైన సనత్సుజాతుల వారు నీ శంకల దీర్చగలడు. ఆయన దేవ తలకును పూజ్యుడు" అని చెప్పెను. సనత్సుజాతుల వారిని ధ్యానించెను విదురునికి ఆమహర్షి సాక్షాత్కరించెను. ఆయనను పూజించి, ధృత రాష్ట్రుని సందేహముల నివర్తింపజేయ వలసినదిగా ప్రార్థించెను. ధృత రాష్ట్రుడు "మృత్యువువున్నదా? లేదా? అను ప్రశ్నతో ప్రారంభిస్తాడు.

ధృతరాష్ట్రుడు పండితులలో మహా పండితుడు పామరులలో మహా పామరుడు విశ్వరూపాన్ని సందర్శించ బోవువాడు. వ్యాసపుత్రుడుకానీ దుర్యోధనునికి తండ్రి, పుట్టంధుడు పదివేల ఏనుగుల బలము కల వాడు. సనత్సుజాతునిది ఒకే ఒక మహా సిద్ధాంతము "ప్రమాదం వై మృత్యుమహం బ్రవీమి, తథా అప్రమాదా దమృతత్వం బ్రవీమి" = ప్రమాదము గలవారికి మృత్యువు, ప్రమాదము లేనివారికి అమృతత్వం ప్రమాదమనగా అజ్ఞానము, అహంకారము, మోహము, కామము, క్రోధము, లోభము, శోకము, తమస్సు, అవిద్యమున్నగునవి, అట్టి ప్రమాదముగల వారికి సంసారము తప్పదు, దేహమే ఆత్మ అనుకొను వారికి సంసారము తప్పదు, నిరంతర బ్రహ్మాను సంధాన మందున్న వారికి ప్రమాదములేదు. వారు మృత్యువునకే మృత్యువులు, బ్రహ్మాను సంధానము చేయకపోవుటయే మృత్యువు, అపైన కర్మాచరణము, యజ్ఞములు, ధర్మములు, ధ్యానము, యోగము, సృష్టిక్రమము, జీవేశ్వరులు, పరమాత్మ జన్మ, మోక్షము, స్వర్గ నరకములు,--మున్నగు విషయములను గూర్చి అక్షత్రియశ్రేష్ఠుడు, మనీషి, మహాత్ముడగు ధృతరాష్ట్రుడు, ఆమహర్షిని తలకువేస్తేమొలకు, మొలకువేస్తే తలకు వంటి ప్రశ్నల బాణాలను వదిలెను వాటన్నిటినీ ఓపికగా పరిహరిస్తాడు సనత్సుజాతుడు

నేను పుట్టి పెరిగిన వాతావరణము ఒక ఋష్యాశ్రమము వంటిది అచట జపతపాదులు నైష్ఠిక కర్మా చరణము. విద్వద్గోష్ఠులు, వేదాంత చర్చలు, ఎడతెగక సాగుచుండెడివి. నాకుజన్మనిచ్చిన తల్లి ఈ శతాబ్ధపు పూర్వార్థంలో ఆంధ్రలోకంలో మహాకవయిత్రిగా గుర్తింపుపొందిన శ్రీమతి కర్రా సుబ్బలక్షమ్మ గారు, వారు దివంగతులైనపిదప మాపితృపాదులు మహాపండితులు శ్రీ కర్రా. రామశర్మగారు (పూర్వాశ్రమమున) శృంగేరి పీఠమున సన్న్యాసాశ్రమమును స్వీకరించి శ్రీశ్రీశ్రీవిమలానందతీర్థులుగా బ్రహ్మీభూతులైరి. వీరిని సేవించిన భాగ్యమున నాకు కొంత వేదాంత

పరిచయమేర్పడినది. అప్పుడు చదివినవీ, విన్నవీ, నేర్చుకొనిన వాటిలో ఈ సనత్సుజాతీయ మొకటి.

నేను చాలా అల్పజ్ఞురాలను, సనత్సుజాతీయము మహాజటిల మైనది, దీనిని స్పృశించుటకు మహాపండితులు కూడ జంకెదరు అంగ్లంలో ఒక సామెతవుంది, దేవతలు కూడా ప్రవేశించుటకు జంకు ప్రదేశమునకు మూర్ఖులు ధైర్యంగా వెడలెదరు. అట్లు నేను ఈ గ్రంథ మును అనువదించుటకు సాహసించితిని మా మాతాపితల ఆశీస్సులు న్నంతవరకూ నాకు ప్రమాదములేదు సదాప్రమోదమే.

వినయపూర్వకప్రణామములు.
R. సుబ్బరత్నమ్మ



# మంగళాచరణము

1. ఓం శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనంధ్యాయేత్ సర్వవిఘ్నోప శాంతయే॥

2. వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్రమ కల్మషం
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్॥

3. వ్యాసాయ విష్ణురూపాయ, వ్యాసరూపాయ విష్ణవే
నమోవై బ్రహ్మనిధియే వాసిష్ఠాయ నమోనమః॥

4. అచతుర్వదనో బ్రహ్మ ద్విబాహురపరోహరిః
అఫాలలోచనః శం భుర్భగవాన్ బాదరాయణః॥

5. కృష్ణం కమలపత్రాక్షం పుణ్యశ్రవణ కీర్తనం
వాసుదేవం జగద్యోనిం నౌమినారాయణం హరిమ్॥

6. పారాశర్యవచస్స రోజమమలం గీతార్థగంధోత్కటం
నానాఖ్యానకకేసరం హరి కథా సంబోధనా బోధితమ్
లోకేసజ్జన షట్పదైరహరహః పేపీయమానంముదాత్
భూయాద్భారత పంకజం కలిమల ప్రధ్వంసి నశ్శ్రేయసే

7. శ్రుతి స్మృతి పురాణా నామాలయం కరుణాలయం
నమామి భగవత్పాదం శంకరం లోకశంకరం॥

8. ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మ విద్యా సంప్రదాయ
కర్తృభ్యోవంశ ఋషిభ్యో నమోగురుభ్యః॥

9. సర్వతత్త్వజ్ఞులు సమస్త శాస్త్రవిదులు
అమృత సిద్ధులు యోగీంద్రులగు సనకస
నందన సనత్కుమార సనత్సుజాత
పరమ దివ్యర్షులంగొల్తు భక్తి యుక్తి॥

# శ్రీ సనత్సు జాతీయము

## ప్రథమాధ్యాయము

### సనత్సుజాత సమాగమము

హరిః ఓమ్

ధృతరాష్ట్ర ఉవాచ :-

శ్లో॥ అనుక్తం యదితే కించిత్ వాచా విదుర విద్యతే
తన్మేశుశ్రూషతే బ్రూహి విచిత్రాణిహి భాషసే ॥ 1

ధృతరాష్ట్రుడు బ్రహ్మతత్త్వమును గూర్చి విదురుని తో నిట్లనియె "విదురా! సాధన సంపత్తియే బ్రహ్మ విద్యాధి కారము నొసగునని నిరూపించితివి. నీప్రసంగమున మధ్య మధ్య బ్రహ్మ విద్యకూడ సూచింపబడినది దానిని వినగోరుచున్నాను నీవింకను చెప్పని దేమైన యున్నచో నీశుశ్రూషచేయునా కెరింగింపుము. నీవు విచిత్రములైన వానిని చెప్పచున్నావు"

విదుర ఉవాచ -

శ్లో॥ ధృతరాష్ట్ర కుమారోవైయః పురాణస్సనాతనః
సనత్సుజాతః ప్రోవాచ మృత్యుర్నాస్తీతి భారత॥ 2

సతే గుహ్యన్ ప్రకాశాంశ్చ సర్వాన్ హృదయ సంశ్రయాన్
ప్రవక్ష్యతి మహారాజ సర్వబుద్ధి మతాం వరః॥ 3

దృతరాష్ట్రా! సనాతనుడును, పురాణపురుషుడును యగు సనత్సుజాతుడు ఉత్తముడు. జనన మరణాత్మక సంసారము లేదనియూ, ఎట్టివారి కది వుండదో, ఆసనత్సుజాతుని వల్ల తెలిసి కొనవగి యున్నది సనత్సుజాతుడు బుద్ధి మంతులలో శ్రేష్ఠుడు. మహారాజా! అతడే నీకు గోప్యములైన

యోగ కళాదులను, ప్రకాశమైన శమాదులను, హృదయాశ్రయము లైన ధర్మములను చెప్పగలడు.

ధృతరాష్ట్ర ఉవాచ :-

కిం త్వం నవేద తద్భూయోయన్మే బ్రూయాత్ సనాతనః
త్వమేవ విదుర బ్రూహి ప్రజ్ఞాశేషోస్తి తేత్తవ॥ 4

ధృతరాష్ట్రుడిట్లనియెను "విదురా! నీవు మహాప్రజ్ఞాశాలివి. నీవు ఎరుగని దేమున్నది? సనాతనుడు చెప్పువిషయమును నీవే సవిస్తరముగా చెప్పుము.

విదుర ఉవాచ :-

శూద్రయోనావహంజాతో నాఽతోఽన్యద్వక్తుముత్సహే
కుమారస్యతు యా బుద్ధిర్వేదతాం శాశ్వతీమహమ్॥ 5

బ్రాహ్మీంహి యోనిమాపన్న స్సుగుహ్యమపియోవదేత్
నతే నగర్హ్యోదేవానాం తస్మాదేతత్ బ్రవీమితే ॥ 6

విదురుడిట్లు చెప్పెను. "రాజా! నేను శూద్రయోనిలో జన్మించితిని. అందుచే బ్రహ్మ విద్యావిషయములు చేప్పుటకుత్సహించను. బ్రహ్మ యోనిజాతుడైన సనత్కుమారుని బుద్ధి శాశ్వతమని నే నెరుగుదును. అందుచే అతడు చాలా గోప్యమైన బ్రహ్మ విద్యను చెప్పగలడు. అతడు దేవతలకును గర్హ్యుడు కాడు. అందుచే నీకా సంగతని చెప్పితిని.

ధృతరాష్ట్ర ఉవాచ :-

బ్రవీహి విదురత్వం మేపురాణం తం సనాతనం
కథమేతే న దేహేన స్యాదిహైవ సమాగమః ॥ 7

ధృతరాష్ట్రుడిట్లనియెను. "విదురా! మానవదేహముతో నున్ననాకు సనాతనుడు, పురాణపురుషుడు నగు అతనితో సమాగమమెట్లేప్పుడునో చెప్పుమా!"

వైశంపాయన ఉవాచ -

చింతయామాస విదురస్తమృషిం శంసితవ్రతం
నచతచ్చింతితం జ్ఞాత్వాదర్శయామాస భారత ॥ 8

సచైనం ప్రతిజగ్రాహ విధిదృష్టేన కర్మణా
సుఖోపవిష్టం విశ్రాంతమథైనం విదురోఽబ్రవీత్ ॥ 9

వైశంపాయనుడు చెప్పుచున్నాడు—సత్యవ్రతుడయిన సనాతన ఋషిని విదురుడు ధ్యానించెను. సనత్సుజాతుడు వెంటనే ప్రత్యక్షమాయెను. విదురుడు తోడనే అమ్మహర్షిని పూజించెను పిమ్మట ఆ ముని విశ్రాంతి తీసుకొని, సుఖముగా నుండగా విదురుడాతనితో నిట్లనియెను.

భగవన్ సంశయః కశ్చిత్ ధృతరాష్ట్రస్యమానసే
యోనశక్యోమయావక్తుం త్వమస్మైవక్తు మర్హసి ॥ 10

యంశ్రుత్వాయం మనుష్యేంద్ర స్సర్వదుఃఖాతిగోభవేత్
లాభాలాభౌ ప్రియాద్వేషోయథైనం నజరాన్తికౌ ॥ 11

విషహేత భయామర్షౌ క్షుత్పిపాసే మదోద్భవౌ
అరతిశ్చైవ త్యంద్రీచ కామక్రోధేక్షయాదయౌ ॥ 12

భగవాన్! ఈ ధృతరాష్ట్రుని మనస్సులో ఒక సందేహము కలిగినది. దానిని తీర్చుటకు నాకు సాధ్యము కాదు. మీరే దానిని తీర్చుటకు సమర్థులు. మీరు చెప్పిన ఆ విషయమును విని ఈ మహారాజు సర్వదుఃఖములను దాటగలడు. లాభాలాభములను, మిత్రులను, శత్రువులను, జరామరణములను, భయము, అసహనము, ఆకలి, దప్పులు, ఐశ్వర్యము, అనాసక్తి, నిద్ర, కామము, క్రోధము, నాశము, అభివృద్ధి-వానికి హేతువులయిన పుణ్యపాపములను సహింపగలడు.



# ద్వితీయాధ్యాయము

వైశంపాయన ఉవాచ -

తతోరాజా ధృతరాష్ట్రామనీషీ
సంపూజ్యవాక్యం విదురేరితం తత్
సనత్సుజాతం రహితే మహాత్మా
పప్రచ్ఛబుద్ధిం పరమాంబు భూషన్ 1

వైశంపాయనుడు చెప్పుచున్నాడు. తర్వాత రాజగు ధృతరాష్ట్రుడు విదురుని హితబోధచే విద్వాంసుడై, అతడు చెప్పిన వాక్యమును చక్కగా ఆదరించి అంగీకరించెను. తర్వాత ఆ మహారాజు సనత్సుజాతుని ఒక రహస్య స్థలమునకు కొని పోయి జ్ఞానము పొందవలయునని ఈక్రింది విధముగ ప్రశ్నించెను. (రహితే = జనవర్జిత మైన రహస్యస్థలమందు)

ధృతరాష్ట్ర ఉవాచ :-

సనత్సుజాతయ దిదం శృణోమి, నమృత్యురస్తీతి తవప్రవాదం।
దేవాను రాహ్యా చరన్ బ్రహ్మచర్యం, అమృత్యపేతత్ కతరం నునత్యమ్॥ 2

ధృతరాష్ట్రుడు చెప్పెను :- సనత్సుజాతా! మృత్యువు లేదని తమరు చెప్పితిరని వింటిని దేవాసురులు (ఇంద్రుడు, రావణుడుము॥) మృత్యువు లేకుండా చేసి కొనుటకై బ్రహ్మచర్యమాచరించిరని వింటిని. మృత్యువు కలదు-లేదు, అనువాదములలో ఏది సత్యమో తెలుపుము.

సనత్సుజాత ఉవాచ - సనత్ = సనాతనబ్రహ్మ = హిరణ్య గర్భుని మనను నుంచి జన్మించిన వాడు.

అమృత్యుః కర్మణా కేచిత్ మృత్యుర్నాస్తీతి చాపరే
శ్రుణుమే బ్రువతో రాజన్ యథైతన్మా విశం కిథాః॥ 3
(మావిశంకిథాః = శంక పెట్టుకొవలదు)

రాజా! కొందరు కర్మలు చేయుటవల్ల మృత్యువును జయించవచ్చునని యు, మరికొందరు అసలు మృత్యువే లేదనియు చెప్పెదరు, వాటిలో

ఏది సత్యమనియే గదా నీవు నన్ను ప్రశ్నించితివి. నా సమాధానము వినినచో నీకు సందేహము తొలగును.

మృత్యు స్వరూప నిరూపణము ఉభేసత్యేక్షత్రి యాద్యప్రవృత్తే
మోహెూ మృత్యుస్సమ్మతో౽యంకవీనాం ప్రమాదంవై
మృత్యుమహం బ్రవీమి తథా౽ప్రమాదమమృతత్వం బ్రవీమి 4

ఓ క్షత్రియా! మృత్యువు కలదు–లేదు–అను రెండు వాదములు సత్యమే మోహము వల్లనే మృత్యువు కలుగుచున్నదను వాదము కొందరు కవులకు సమ్మతమైనది. కాని నేను మాత్రము ప్రమాదమునే మృత్యువుగను, అప్రమాదమునే మోక్షముగను చెప్పుచున్నాను.

విశే ,– మోహము = మిథ్యాజ్ఞానము = ఆత్మకాని దేహాదులందు ఆత్మ యను అభిమానము కలిగియుండుట నా మతమున మోహము మృత్యువు కాదు. ప్రమాదమే మృత్యువు స్వాభావికమగు బ్రహ్మ భావమునుండి వేరగుటయే ప్రమాదము ప్రమాదము వలన మిథ్యా జ్ఞానము కలుగుచున్నది. అవిద్యావస్థలో ప్రాణికి కర్మబంధము కల్గుట సత్యము, దాని వలన మృత్యువు కలుగుచున్నది. విద్యావంతుడయిన వానికి బంధము రజ్జువునందు సర్పభ్రాంతివలె నుండును. నిజముగ కాల త్రయమందు మృత్యువు లేదు. మోహముచే వున్నదని అనిపించినను ఆ బంధము జ్ఞానముచే తొలగును. మోహము లేని వారికి మృత్యువు లేదు. మోహము ప్రమాదము మోహము లేకుండుట అప్రమాదము.

ప్రమాదాద్వై హ్యసురాః పరాభవన్నప్రమాదాత్ బ్రహ్మభూతాభవన్తి
నవై మృత్యుర్వ్యాఘ్ర ఇవాత్తి జంతూన్నహ్యస్వరూప
ముపలభ్యతేహి 5

రాక్షసులు ప్రమాదము వల్లనే పరాభవము పొంది మరణిం చిరి. దేవతలు అప్రమాదము వల్లనే బ్రహ్మీభూతులై ముక్తులయిరి, పరికింపగా జంతువులను భక్షించు పెద్దపులికి వలె మృత్యువునకు రూప మనునది ఒకటి లేదుకదా!

విశే - సు = ఆత్మయందు రతులై రమింకుట వలన సురలు, అను రులు = అజ్ఞాన స్వరూపమయిన అనాత్మ విదులై దేహమునే ఆత్మగా భావించి, అసువులందు = ప్రాణములు, ఇంద్రియములు, కామ, క్రోధ భలో, మోహ, మదమాత్సర్యములందు రమించు వారే అసు + ర + లు వారు పశు పక్ష్యాది యోనులను పొందుచున్నారు. సురులు సర్వ లోక ములను సర్వకామములనుపొంది విజ్ఞానవంతులై, సచ్చిదానంద స్వరూపమగు ఆత్మనుధ్యానించి, బ్రహ్మభూతులగుచున్నారు. "తంవా ఏతం దేవా ఆత్మానముపాసతే। తస్మాచ్చ తేషాం సర్వేచ కామాః ॥" రజ్జువునందు సర్పభ్రాంతి వంటిదే కానీ నిజముగా మృత్యువు లేదు. జీవులను చంపే పెద్దపులి వంటిది కాదు

యమంత్వేకే మృత్యుమతోఽన్యమాహు రాత్మావసాన మమృతం
బ్రహ్మచర్యం
పితృలోకే రాజ్యమను శాస్తి దేవః శివశ్శివానామ
శివోఽశివానామ్ ॥ 6

కొందరు యమునే మృత్యువని చెప్పుచున్నారు. అది పొర దాటు యముని కంటె వేరుగా మృత్యువు కలదు. అదియే ప్రమాదము. బ్రహ్మజ్ఞానసంపన్నుడై యుండుటయే అమృతత్వము అనగా మోక్షము అదియే బ్రహ్మచర్యము. పితృలోకమున రాజ్యము నేలు దేవుడు యముడు అతడు పుణ్యాత్ములకు శివుడు గాను, పాపాత్ములకు అశివుడుగాను యుండును

విశే ,- యముడు సాక్షాత్తుగా మృత్యువుకాడు. రూపము లేని మృత్యు నకే ప్రమాదమనియు, అజ్ఞానమనియు పేర్లు "మృత్యుర్వైతమో జ్యోతిరమృతం"- తమస్సు మృత్యువు జ్యోతి అమృతము . అనగా మోక్షము, విషయవిషోంధులును, అవిద్యాము ఢులునూ, కొందరు యముని మృత్యువుగా తలచుచున్నారు. యముడు ఎక్కడో లేడు. మన ఆత్మలోనే, మన బుద్ధిలోనే కలడు.

"యమోవైవస్వతో రాజాయంతవైషహృదిస్థితః
తేన చే దవివాదస్తే మాగంగాం మాకురూన్గమః

యమయతీతి యమః" = జీవులను నియమించువాడు. శిక్షించువాడు యముడు.

ఆస్యాదేషనిస్సరతేనరాణాం। క్రోధః ప్రమాదో లోభరూపశ్చమృత్యుః
అహంగతేనైవచరన్ విమార్గాన్నచాత్మనో యోగముపైతికశ్చిత్॥ 7

అ యముని ఆజ్ఞవలన నరుల హృదయములలో మృత్యువు క్రోధ, ప్రమాద, లోభరూపములుగా పుట్టుచున్నది వానివలన అహం కారము కలుగుచున్నది. అహంకారులయిన మానవులు వేదశాస్త్రవిరుద్ధములయిన మార్గములలో సంచరించుచున్నారు. అందుచే యెవడును పరమాత్మకు చెందిన యోగమార్గమును చెందకున్నారు.

తేమోహితాస్తద్వశేవర్తమానా। ఇతఃప్రేతాస్తత్రపునఃపతంతి
తతస్తాన్ దేవా అనువిప్లవన్తే। అతోమృత్యుర్మరణాఖ్యాముపైతి॥ 8

మానవులు అహంకారరూప మృత్యువుచే మోహితులై మృత్యువశమున మెలగుచున్నారు. పిమ్మట వారు ప్రేతములై ధూమాది మార్గమున బోయి స్వర్గమున కొంతకాలముండి మరల భూమిపై మాతృగర్భమున పడుతున్నారు. నేలపై దేహము నొందిన అవస్థలో నున్నప్పుడు దేవులు–అనగా ఇంద్రియములు జీవుల నాశ్రయించి కర్మలలో తేలియాడించుచున్నది. అందు వలన అహంకారరూపమైన మృత్యువు మరణమను పేరు పొందుచున్నది.

విశే – నరులకు మృత్యువుకు అవినాభావ సంబంధము కలదు. నరుడు = నృణంతి = నయంతిసర్వం స్వవశమితినరాః = నరుడు కామ క్రోధ, లోభ, మొహ ప్రమాదములకు స్థానము కాన అహంకారపూర్ణుడై సమస్తమును తన వశము చేసుకొనుటకే ప్రయత్నించును. కామ క్రోధాదులు ఆరున్నూ మృత్యువు రూపాంతరములే. వాని వశమందున్న

మానవుడు మృత్యువునోట నున్నట్లే, మృత్యువుయొక్కపని తన వశమందున్న వారి ప్రాణముల తొలగించి, మరల జన్మ నెత్తించుటయే జ్ఞానులు, యోగులు, తపోనిదులు తప్ప ఇతరులు మృత్యువును తప్పించుకొనలేరు.

కర్మోదయే కర్మఫలానురాగా స్తత్రానుతేయాన్తినతరంతి మృత్యుం
సదర్థయోగానవగమాత్సమంతాత్ ప్రవర్తతేభోగయోగేన దేహీ 9

కర్మలనాచరించిన మానవులు కర్మఫలానురక్తులై స్వర్గాదులకేగుచున్నారు, స్వర్గసుఖమనుభవించిన పిమ్మట మరల భూమిపై జన్మించుచున్నారు అందుచేత మానవులు జనన మరణ రూపమైన మృత్యువును దాటలేరు, అట్టి దేహులు తదర్థమైన పరమాత్మను పొందలేక భోగాభిలాషచే నానా యోనులలో పుట్టుచున్నారు.

తద్వైమహామోహానమింద్రియాణాం। మిథ్యార్థయోగస్యగతిర్హినిత్యా।
మిథ్యార్థయోగాభిహతాంతరాత్మా। స్మరన్నుపాస్తే విషయాన్
సమాంతత్॥ 10

మహామోహమనగా కర్మేంద్రియ జ్ఞానేంద్రియ వాంఛలకు వశులై ప్రవర్తించుట అట్లు మోహమందిన వారికి శబ్దాదుల యందు సంబంధముండుట వలన సంసారపతనమే నిత్యకృత్యమై యున్నది, ఇట్లు సంసారబంధము కలుగుటయే "మిథ్యార్థ" యోగము అట్టియోగము చే మానవుడు తనమ ననున నిత్యము శబ్దాది విషయములనే స్మరించుచుండును గానీ మోక్షమును గూర్చి చింతింపడు.

అభిధ్యావైప్రథమంహన్తిచైనం। కామక్రోధావను గృహ్యాశు పశ్చాత్।
ఏతేబాలాన్ మృత్యవే ప్రాపయంతి। ధీరాస్తుధైర్యేణ తరన్తి
మృత్యుమ్॥ 11

ఇంద్రియవాంఛల కనుకూలముగా కామక్రోధాదులు కలుగుటయే అభిధ్యయనబడును. అదిలోకులను మొదట హతమార్చును. (తన వశము చేసుకొనును.) అట్టివారు విద్యావంతులైనను, వివేకహీనులైనను,

బాలురుగా నే యుందురు, అందుచే వారు క్రమముగా మృత్యువునే పొందెదరు. ఇంద్రియ నిగ్రహము గల ధీరులు మాత్రము ధైర్యము చే మృత్యువును దాటు చున్నారు;

విశే :- జ్ఞానహీనులైన బాలురు ఇంద్రియములనే ఆత్మగాభావించి వానినే నిత్యము స్మరింతురు. " పరాచః కామానను యంతి బాలాస్తే మృత్యోర్యంతి వితతస్యపాశం। అథధీరా అమృతత్వం విదిత్వా ధ్రువ మధ్రువేష్వహిన ప్రార్థయంతే" (2-1 2, కఠ ✤ = విషయములందా సక్తిగల అజ్ఞానులగు బాలురు బాహ్యకామము లనుకోరి జనన మరణా ది రూపమైన అనర్థమును పొందుచున్నారు ధీరులైన, విషయములం దా సక్తిలేని జ్ఞానులు ఈసంసారమును అశాశ్వతమనియు, మోక్షము శాశ్వత మనియు తెలుసుకొనెదరు. ధీరులు = "వికారహేతౌ సతివిక్రియం తే ఏపాంనచేతాంసిత ఏవం ధీరాః" - (కాళిదాస్) = అందగత్తెలను' రుచిగల వస్తువులను చూచి ఎవరి మనసు చలించదో వారు ధీరులు. 'ఆశాయైదాసా యేతే స్సర్వలోకస్య। ఆశాదాసీ యేపాంతేపాం దాసాయతే లోకః॥"

సోఽభి ధ్యాయన్నుత్పతిశా న్నిహన్యా దనాదరేణా ప్రతిబుధ్యమానః
నైనం మృత్యుర్మృత్యు రివాత్తిభూత్వా ఏవం విద్వాన్ యో వినిహ
న్తి కామాన్॥ 12
యేఽభిధ్యాయన్నుత్పతిష్ణాన్నిహన్యా దనాచారేణా ప్రతిబుధ్యమానః
సవైమృత్యుం మృత్యురివాత్తి భూత్వా హ్యేనం విద్వాన్యోభిహంతిహ
కామాన్॥ 12

ధీరుడు పరబ్రహ్మస్వరూపమునే చక్కగా ధ్యానించుచు, కామక్రోధాదు లకు కారణము లైన తన ఇంద్రియముల జయించును. కామక్రోధాదు లకు ఆశ్రయములైన ధన, వనితాదులను అనాదరముగా చూచును' అందుచే వానిని మృత్యువు పీడించజాలదు, అతడే మృత్యువు నకు

మృత్యువుగా నుండును. ఇట్లు మృత్యుంజయుడై కామాదుల నడంచిన వాడే విద్వాంసుడు

కామాను సారీపురుషః కామాననువినశ్యతి॥
కామాన్ వ్యుదస్యధునుతే, యత్కించిత్ పురుషోరజః॥ 1[3]

కామాదుల ననుసరించి పోవునట్టి మానవుడు ఆకామాదుల చేతనే నశించును. కామాదులను త్యజించిన మానవుడు వివేకియై పుణ్యాపాప కర్మ ఫలమైన రజస్సును ధ్వంసము చేయును అనగా మృత్యువును మీర గలడు

విశే – "కురంగ మాతంగ పతంగ భృంగ। మీనా హతాః పంచభిరేవ పంచ" లేడి, ఏనుగు, పక్షి, తుమ్మెద, చేప-ఈ ఐదున్ను శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములచే ఆకర్షింప బడి హతమగు చున్నవి.

శ్లో॥ తమోఽప్రకాశో భూతానాంఽయంప్రదృశ్యతే
మహస్య ఇవధావని గచ్ఛన్తః శ్వభ్రవత్సుఖమ్॥ 14
దేహోఽప్రకాశో భూతానాం నరకోఽయంప్రదర్శతే
గృహ్యంత ఇవధావంతి గచ్ఛత శ్వభ్రముమ్ముఖాః॥ 14

ప్రాణులకు కామమును, కామాశ్రయమైన దేహము చీకటివలెవుండి వారి వివేకమును హరించును. అదినరకమువలె దుఃఖమునేగలిగించును కామమునకు వశులైనవారు మత్తెక్కిన వారివలె తుచ్ఛ సుఖములకై పరుగెత్తెదరు అంధులవలె సంసారకూపమున పడెదరు.

అస్థి స్థూణం స్నాయు బద్ధం మాంస శోణిత వేష్టితం।
చర్మావనద్ధం దుర్గంధపిపూర్ణం మూత్రపురీషయోః॥
జరాశోక సమావిష్టం రోగాయతన మాతురం। రజస్వల మనిత్యంచ
భూతావాస మి మంత్యజేత్॥ (మనువు)

ఇటువంటి దేహము కామనిలయము, పాముల పట్టువాడు పాములచేత

మరణించునట్లు. కామాదుల నాశ్రయించువాడు వాటిచేతనే నశించును. కాముకుడు, త్రాగుబోతు, గ్రుడ్డివాడు సమానులు.

అమూఢవృత్తేః పురుషస్యేహ కుర్యాత్ కింవై మృత్యుస్తార్ణ
ఇవాస్య వ్యాఘ్రః
అమన్యమానః క్షత్రియకించిదన్యంన్నాధీయసిర్ణుదన్నివాస్యచాయుః15

సకాము డై యుండుటే మూఢవృత్తి. నిష్కాము డైయుండుట అమూఢ వృత్తి. నిష్కాముడైన వానిని మృత్యువు గడ్డి పులివలెయుండి యేమియు చేయఁజాలదు క్షత్రియుడా! మూఢుడు దేహమున కంటే భిన్నమైనదియు. శ్రేష్ఠమైనదియు నగు బ్రహ్మవస్తువు కలదని ఎరుగడు అందుచేత అధ్యాత్మ విద్యను అభ్యసించడు కావున వాని దేహమే నిరర్ధకమై, మృత్యువై పీడించునని యెరుగుము దేహము అజ్ఞానుల పాలిటి మృత్యువని తెలుసుకొనుము, ఆత్మయే ఆత్మకు బంధువు. ఆత్మయే ఆత్మకు శత్రువు.

విశే .- "అహం" అనగా అంతరాత్మయైన బ్రహ్మతత్త్వము, అది అన్ని వస్తువుల యందును కలదు, శరీరము ఆయా వస్తువులకు మాత్రమే కలదు, "తత్ = బ్రహ్మ పదార్థము. బ్రహ్మపదార్థము కాని దానిని అజ్ఞానముచే బ్రహ్మ పదార్థమను కొనుటయే మోహము. మోహవంతుడైన అజ్ఞాని ఆత్మకాని దేహదులను ఆత్మగా భావించును. అందుచే కామ క్రోధములు జనించును. అవియే అజ్ఞానికి మత్యువులు." శుకనలికా న్యాయము " ననుసరించి మానవుడు స్వయముగ బంధములేనివాడైనను అజ్ఞానముచే తనను ఏదియో బంధించినట్లు భావించి, బంధ విముక్తి కోరును. 'శుక నలికము' అనునది మోహోత్పాదకమగు అస్త్రము.

సక్రోధలోభొ మోహవాన్ అంతరాత్మా సవైమృత్యుఃత్వచ్ఛరీరేయవిషః
ఏవం మృత్యుంజాయమానం విదిత్వా జ్ఞానేతిష్ఠన్ నబి భేతీహమృత్యోః
వినశ్యతే విషయే తస్య మృత్యుర్మృత్యోర్యథా విషయం
ప్రాప్య మర్త్యః॥ 16

అయ్యా! మృత్యువు యొక్కడోలేదు. క్రోధ. లోభ, మోహ రూపముననుు, వానిచే కలిగిన అహంకారముతో కూడియున్న అంతరాత్మ రూపముననుు మృత్యువు నీలోనేకలదు. అది నీ శరీరమునే ఆశ్రయించి యున్నదని తెలుసుకో పై విషయములను ఇట్టి కామ. క్రోధ, లోభ, మోహ, అహంకార, ప్రమాదములను నవియే మృత్యు స్వరూపమని ఎరుగుము . జ్ఞానియై ఆత్మ పదార్థము నెరిగినపుడు మానవుడు మృత్యువునకు భయపడడు, మృత్యు విషయమైన సంసారమందున్న మర్త్యుడు మత్యువు వల్ల నశించినట్లే జ్ఞాని చెంతకు వచ్చిన మృత్యువుకూడా జ్ఞానముచేతనే నశించును

విశే - ఇచ్చట "శతరుద్రీయ మంత్రము" లను అను సంధానముచేసుకోవలెను.

త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం
ఉర్వారుకమివ బంధనాత్। మృత్యోర్ముక్షీయమాఽమృతాత్
అపమృత్యుమపక్షుధం। అపేత శపథం జహి
యోరుద్రో అగ్నౌ యో అప్సుయ ఓషధీషు॥

ధృతరాష్ట్ర ఉవాచ -

యానేవాహు రిజ్యయా సాధులోకాన్ ద్విజాతీనాం
పుణ్యతమాన్ సనాతనాన్
తేషాం పరార్థం కథయం తీహ వేదాః
ఏతద్విద్వాన్ నోపైతి కథం ను కర్మ॥ 17

అయ్యా! విప్రులు జ్యోతి ష్టోమము, అశ్వమేధము మున్నగు యజ్ఞ కర్మల నాచరించి, ఆచరింపజేయుచు స్వర్గము మొదలు బ్రహ్మలోకము వరకు గల ఉత్తమ లోకములను పొందుచు, పొందింపజేయుచున్నారు, అవియే అన్నింటి కంటె పవిత్రములు, నిత్యములు. ఆ ఉత్తమ లోకములే మోక్షధనములని చెప్పుచున్నవి. పరమపురుష

ప్రాప్తికి కర్మములే సాధనములని యెరిగిన విద్వాంసులు కర్మమార్గము ల నెట్లు పొందక యుందురు?" అని ధృతరాష్ట్రుడు ప్రశ్నించెను.

సనత్సుజాత ఉవాచ -

ఏవంహ్యవిద్వానుప యాతి తత్ర తత్రార్థ జాతంచ వదన్తి వేదాః
సనేహయాతి పరం పరాత్మా ప్రయాతి మార్గేణ నిహంత్య మార్గాన్॥18

విద్వాంసుడు కానివాడు జ్ఞానిహీనుడు బ్రహ్మలోకాది సాధన భూతమైన కర్మమార్గమున ప్రవేశించును ఆనందాదిలోకము లందలి ప్రయోజనములు కేవల అజ్ఞానికి, అనగా సకామునకు చెందినవిగా వేదములు చెప్పుచున్నవి విద్వాంసులు పరమాత్మ స్వరూపులు జ్ఞానులు సంసార బంధహేతువులైన మార్గములన్ను విడనాడి, జ్ఞానమార్గమున పరమాత్మను పొందుచున్నారు.

ధృతరాష్ట్ర ఉవాచ -

కోఽసౌనియుంక్తే తమజం పురాణం సచేదిదం సర్వమను క్రమేణ
కింవాస్య కార్య మథవా సుఖంచ తంమే విద్వన్ బ్రూహి సర్వం యథావత్॥ 19

అయ్యా! పరమాత్మ చావు పుట్టుకలు లేనివాడు పురాణ పురుషుడు. అతడే పాంచభౌతికమైన జగత్తును సృష్టించి అందు ప్రవేశించుచున్నా డని చెప్పితిరేని, ఆ పరమాత్మను సంసారమున ప్రవేశింపుమని నియోగించువాడెవడు? లేదా అతడే స్వయముగా లోకమున ప్రవేశించె నంటిరేని అతనికి కలుగు లాభమేమి? అందుచే అతనికి కలుగు సుఖమేమి? విద్వాంసుడా! యదార్థముగ తెలుపుము.

విశే .- యాజ్ఞవల్క్యుడు కూడా "యద్యేవం సకథం బ్రహ్మన్ పాపయోని షుజాయతే। సఈశ్వరంః కథం భావైరనిష్టై సంప్రయుజ్యతే॥" అని ప్రశ్నించాడు = అబ్రహ్మము ఈవిధముగా సృష్టిగావించినపుడు ఆ

పరమాత్మ పాపయోనులలో నేట్లు జన్మించుచున్నాడు? అందరకు ఈశ్వరుడుడైన అతడు అనిష్టమైన భావముతో ఎట్లు మేళవింపబడుచు న్నాడు? 1 జీవుడు పరమాత్మకా లేడు. 2. పరమాత్మ జీవుడుగా పరిణమించడు. 3 ఇంకెవరో ఒకరు ఆయనను నియోగించినారన్నచో, వానికింకొక నియోజకుడుండ వలసి వచ్చును నియోజకులు పెక్కు మంది వుండరు 4. నిష్కాముడైన పరబ్రహ్మకు ప్రకృతితో కర్తవ్యమే మున్నది? 5 అతని కీలోక ప్రవృత్తి ఎందు కుండాలి? 6 ఇదిలీలా కైవల్య మంటావా? తన్నుతానే సంకటంలో తోసుకోవడంలో సుఖ మేముంది?

సనత్సుజాత ఉవాచ ,-

దోషోమహనత్ర విభేదయోగే। హ్యనాదియోగే నభవన్తినిత్యాః
తథాస్యనాధిక్యముపైతికించి। దనాదియోగేన భవంతి పుంసః॥ 20

రాజా! జీవ, పరబ్రహ్మలు వేరు యనెది విభేదయోగమున గొప్ప దోషము గలదు. అట్లు వాదించు వారికి గొప్ప భయమును. నష్టము ను కలదు. అనాది యైన ప్రకృతి యొక్క సంబంధముచే జీవుడు నిత్యుడగు చున్నాడు ప్రకృతి కార్యము పురుషుడు-కారణము. కార్యకారణ స్వరూపుడు పరమాత్మయే కావున జీవబ్రహ్మలొక్కటేయని చెప్పినంత మాత్రాన బ్రహ్మపదార్థమునకుగల అధిక్యత కొంచెమైనను తగ్గదు అనాది యైనప్రకృతి యొక్క యోగము చేతనే జీవరూప పురుషులు పెక్కు మంది యేర్పడు చున్నారు

వివరణము - 1 "బహుస్యాం ప్రజాయేయేతి" అను శ్రుతి వాక్య మును చూచినచో సృష్టికార్యము నిర్వహించు బ్రహ్మ పదార్థమునందే జీవత్వము ఆరోపింపబడెను అట్టి ఆరోపవాదము చే జీవబ్రహ్మలు ఒకటియే యను తలంపు యేర్పడిన దని తెలియును. 2. తత్సృష్ట్వా తదేవాను ప్రావిశతు" = పరబ్రహ్మమే జగముల సృజించి, అందుతాను ప్రవేశించె ననిచెప్పెను. అనగా బ్రహ్మపదార్థమే జీవుడుగా మారినట్లు చెప్పెను దీవినే పరిమాణామవాద మందురు, ఈవాదము ననుసరించి

నిష్కామిడైన పరమాత్మకు జీవుడుగా మారుటచే కలుగు ప్రయోజన మేమి? అనే శంక కలుగుచున్నది పై కారణములచే జీవ, బ్రహ్మలు ఒకటియా? వేర్వేరుగా వున్నవా? అనునది ధృతరాష్ట్రుని ప్రశ్న.

విశే - భూమ్యాకాశాది రూపమున వున్న సామాన్య ప్రకృతియు బ్రహ్మయోని యైన మూల ప్రకృతియు కార్యములు. పురుషుడగు పర బ్రహ్మము కారణము కార్యకారణములు రెండునూ పరమాత్మ స్వరూపములే అందుచే కార్యమైన జీవుడు, కారణమైన బ్రహ్మము ఒక్కటే వాటికి భేదము లేదు. ప్రకృతి సంబంధముచే పరబ్రహ్మకు నానాత్వము కలదన్న వారికి మృత్యుభయము వాటిల్లును ప్రకృతి-పురుషుడు, ఇరువురు అనాదులు (గీత), జలచంద్ర న్యాయమున, ఘటాకాశన్యాయమున ప్రకృతి సంబంధముచే, పురుషుడైన పరమాత్మకు నానాత్వము కలుగుచున్నది నానాత్వము ఔపాధికము ఉపాధియనగా ఆధారము జలమునకు ఘటము ఆధారము, ఘటము అనేకములుగా నుండుటచే వాని యందలి జలములకును, జలములందు కనబడు చంద్రునకును నానాత్వము కలుగుచున్నది. కానీ నిజమైన చంద్రునకు నానాత్వము లేదు అటులనే ఉపాదులందు జీవులకే నానాత్వముకానీ బ్రహ్మమునకులేదు సర్వాంతర్యామియు, సృష్టికి కారణమగు పరబ్రహ్మ జీవరూపమున వివిధ దేహములందున్నప్పటికీ పూర్ణమే అద్వైతమే. భ్రాంతి దృష్టిగల వారికి జీవుడు వేరు-బ్రహ్మమువేరు అనుద్వైత భావమేర్పడినమా, భ్రాంతితొలగగనే ద్వైత భేదభావము లు తొలగును

యఏతద్వా భగవాన్ సనిత్యో వికార యోగేన కరోతి విశ్వం
తథాచ తచ్ఛక్తి రితిస్మమన్యతే తథార్థ యోగేచ భవన్తి వేదాః॥ 21

ఈ జగత్తులను సృష్టించుచున్నట్లు కనబడుచున్న భగవంతుడు నిత్యుడు అతడు వికారమైన మాయయొక్క వేగము చేత విశ్వమును కావించుచున్నాడు. అపరమాత్మశక్తి, పరమాత్మ భిన్నమై కానవచ్చు చున్నదని వేదములు చెప్పుచున్నవి. జగత్తునకు ఉపాదాన కారణమైన భగవంతు

నికి, అతని శక్తియైన మాయకును భేదములేదు-అనుటలో వేదములే ప్రమాణములు

విశే - పరమాత్మ శక్తి యైన మాయయే జగత్కారణము. కానీ పరమాత్మ కాదు.

"ఇంద్రోమాయాభిః పురుషరూప ఈయతే." (ఛాం. ఉ)
"మాయాంతు ప్రకృతిం విద్ధి మాయినంతు మహేశ్వరం" (శ్వే. ఉ)
"మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్" (గీత)

"దేవాత్మ శక్తిం స్వగుణైర్ని గూఢాం పరాస్యశక్తిర్వి విధై వశ్రూయతే" మాయయేశక్తి మాయగల ఆత్మయే శక్తి మంతుడు. అగ్నికిని దానియందుగల దాహకశక్తికిని భేదము లేదు

ధృతరాష్ట్ర ఉవాచ -

యేఽస్మిన్ ధర్మాన్నాచరంతీహకేచి త్తథా ధర్మాన్ కేచిదిహా చరంతి
ధర్మః పాపేన ప్రతిహన్యతేస్వి దుతాహో ధర్మః ప్రతి హన్తి పాపమ్॥22

ఈ లోకమందు యజ్ఞయాగాది ధర్మములను కొందరు చేయు చున్నారు కొందరు అధర్మప్రవర్తకులై యున్నారు ధర్మము పాపముచే ప్రతిహతమగు చున్నదా? ధర్మమే పాపమును నశింపజేయు చున్నదా?
విశే - ధర్మమును అధికముగా చేయనివారు కొందరున్నారు కదా. వారి ధర్మము పాపము చేనశించునా? పాపమును అధికముగా ఆచరింపని వారు కొందరు కలరు. వారిపాపము ధర్మముచే నశించునా? యజ్ఞయాగాదులచే మృత్యువును పోగొట్టుకొని, క్రమముక్తిని పొందుచున్నారు కదా. అపక్షమున కర్మమోక్షహేతువు కదా. కొందరు కర్మల వదలి సన్యసించు చున్నారుకదా! వారందరి ధర్మము రాగద్వేషాది పాపముచే నశించునా? లేకధర్మమే పాపమును నశింపజేయునా?

సనత్సుజాత ఉవాచ -

ఉభయమేవతత్రోపయుజ్యతేఫలం ధర్మస్యైవై కర్మణశ్చేతరస్యచ 23

సన్న్యాసము, ఉపాసన-అను రెండున్నూ మోక్షదాయకములే. స్వర్గము ధర్మమునకు ఫలము, ఇతరమైనటువంటి అధర్మమునకు నరకము ఫలము.

తస్మిన్ స్థితౌ వాప్యుభయంహినిత్యం జ్ఞానేనవిద్వాన్ ప్రతిహన్తి సిద్ధమ్
యథాన్యథా పుణ్యముపైతిదేహీ తథాగతం పాపముపైతి సిద్ధమ్ 24

పుణ్యపాపరూప కర్మల నిర్వహణమున నున్నను జ్ఞాని ధర్మాధర్మములను పుణ్యపాపములను, తనజ్ఞానము చే నశింపజేయును. జ్ఞానహీనుడు పుణ్య పాపముల ననుభవించుటకు, దేహియై జన్మల నెత్తు చుండును.

విశే - తద్యథేషీక తూలమగ్నౌ ప్రోతం ప్రదూయే తైవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయన్తే " రెల్లు గడ్డి చివరనగల దూది అగ్నిలోబడి కాలి పోయినట్లే, పుణ్యాపాపము లన్నియు జ్ఞానాగ్నిచే నశించును. తథావిద్వాన్ పుణ్యపాపే విధూయ నిరంజనః పరమం సామ్యము పైతి" = విద్వాం సుడు పుణ్యపాపములను పోగొట్టుకొని నిరంజనుడై పరమాత్మను బొందు ను కర్మాసక్తులకు జన్మమూ తప్పదు. స్వర్గకాంక్షకలిగిన నరుడు దేవ తోపాసనజేసి దేవతాభావమును పొందును. దేహాభిమానియైనచో నరక ము నుబొంది మానవలోకము న జన్మించును. సామాన్యులందరూ పుణ్య పాపములను యెక్కువ తక్కువ పాళ్లలో చేయుచునేయుందురు. వారి పుణ్యములు పాపముచెగానీ పాపము పుణ్యముచేగానీ నశింపవు వానిని అనుభవించి తీరవలసినదే విద్వాంసులు మాత్రము తమజ్ఞానాగ్నిచే ఆరెంటినీ నశింపచేసుకొనగలరు.

గత్వోభయం కర్మణా భుజ్యతేఽస్థిరం శుభస్మపాపస్య సచాపి కర్మణా
ధర్మేణపాపంప్రణుదతీహవిద్వాన్ ధర్మోబలీయానితితస్యసిద్ధిః॥ 25

మానవులు పుణ్య కర్మలాచరించి పరలోకమును చేరికర్మాను సారముగ పుణ్యపాప ఫలములను పొందెదరు. ఆఫలమూ అస్థిరములని యెరిగి విద్వాంసులు ఈశ్వర ప్రీతిగా చేయుధర్మ కార్యములచే పాపము ను పోగొట్టుకొందురు. ధర్మాధర్మములలో ధర్మ మే బలీయమైనది.

ధృతరాష్ట్ర ఉవాచ ,-

యానీహాహుఃస్వస్యధర్మస్యలోకాన్ ద్విజాతీనాంపుణ్యకృతాంసనాతనాన్
తేషాంక్రమాన్ కథయ తతోఽపిచాన్యాన్ నైతద్విద్వన్ వేత్తుమిచ్ఛామి
కర్మ॥ 26

పుణ్యములు చేయువారలకు తమధర్మముల కనుకూలమైన లోకములు ప్రాప్తించును అవినిత్యములని పెద్దలు చెప్పుచున్నారు. ఆలోకములలో ఏవి ఉత్తమములో, ఏవినీచములో వాని క్రమమును తెలుపుము. అంతే గాని, కామ్య కర్మలకు చెందిన లోకములను గూర్చి నాకు తెలుసుకొన వలెననెడి తలంపు లేదునుమా!

సనత్సుజాత ఉవాచ -

యేషాంవ్రతేఽథ విస్పర్ధాబలే బలమతామివ
తేబ్రాహ్మణాఇతః ప్రేత్య స్వర్గేయాన్తి ప్రకాశతాం॥ 27

బలహీనుని జయించి బలవంతుడు సుఖమను భవించగోరునట్లు కొందరు బ్రాహ్మణులు ఫలములనుకోరి జ్యోతిష్టోమాదిధర్మములగూర్చి సంఘర్షణ చేయుదురు, వారు ధర్మాచరణముచే బ్రహ్మలోక ప్రకాశకులై స్వర్గము ను చేరినను, ఆధర్మపలాను భవమూ క్షీణింపగనే వారు తిరిగీ ఈలోక మునే చేరుచున్నారు.

విశే - జ్ఞానులు ప్రవృత్తి ధర్మము నందు స్పర్ధలేకయుందురు వారు ఫలాశను వీడి విష్ణుప్రీతికై ప్రవృత్తి ధర్మము నాచరింతురు, అజ్ఞానులు ఫలాకాంక్షచే యజ్ఞయగాది కర్మల నాచరించి ధూమాది మార్గమున స్వర్గాదిలోకములకు పోయి, అదే దారిన తిరిగివస్తారు.

యేషాంధర్మేచవిస్పర్ధాతేషాం తత్ జ్ఞాన సాధనమ్
తేబ్రాహ్మణాఇతో ముక్తాః స్వర్గం యాంతి త్రివిష్టపమ్॥ 28

నిష్కామముగ, ఈశ్వరార్పణబుద్ధితో కర్మలనాచరించువారు జ్యోతిష్టోమా ది ధర్మము విషయమైనసంఘర్షణ చేయరు. అందుచేవారు చేయుకర్మలు జ్ఞానసాధనములే యగును అట్టి బ్రాహ్మణులు కర్మలచే విశుద్ధ చిత్తులై ముక్తులగుదురు. అందుచేవారు స్వర్గమునకు పోయినను క్రమముగా

బ్రహ్మ నిలయమును, త్రివిష్టపము పేరుగలను సత్యలోకమును చేరు చున్నారు.

తస్య సమ్యక్సమాచార మాహుర్వేద విదోజనాః

నైనం మన్యేత భూయిష్ఠం బాహ్యమాభ్యన్తరం జనమ్॥ 29

బ్రహ్మచర్యమొనర్చి కామ్యకర్మ సన్న్యాసముగా వించినవాడే విద్వాంసుడు. అతడే బ్రహ్మనిష్ఠుడైన పండితుడు. వాడే సన్న్యాసి. అతడు బాహ్యమైన ఐహికాముష్మిక ఫలముల నాశింపడు. అభ్యంతరములైన భార్యా బిడ్డలు, గృహములను తలంచడు-అని వేదవేత్తలు చెప్పుచున్నారు.

యత్రమన్యేతభూయిష్ఠం ప్రావృషీవ తృణోలపం

అన్నపానం బ్రాహ్మణస్య, తజ్జీవేన్నాను సంజ్వరేత్॥ 30

సన్న్యాసిపర్షాకాలమందలి తృణోదకములవలె ఆహారము మిక్కుటముగా లభించు గృహస్థుల ఇండ్లకేగి, అన్నపానముల నభ్యర్థించునేకాని, వారికిగల అన్నపానాదులు తనకు లేవని విచారింపడు ఉలపము = దర్భలు ఒట్టముగా పెరిగిన గడ్డి.

విశే - ఆకలి దప్పులతో తనను శుష్కింప చేసుకొనరాదు.

యత్రా కథయమానస్య ప్రయచ్ఛత్యశివం భయమ్

అతిరిక్తమివాకుర్వన్ సశ్రేయాన్నేతరో జనః॥ 31

సన్న్యాసి తనగొప్పను తాను ఇతరులకు చెప్పుకొనడు. అతడు తనకితరులవల్ల జరిగిన అవమానము తనదికానట్లే తలచును. తనను అవమానించిన వానినే గొప్పవానిగా తలచును, తనను పొగడిన వానిని శత్రువుగా తలచును

యోవాఽకథయ మానస్యహ్యాత్మానం నాను సంజ్వరేత్

బ్రహ్మస్వం నోప భుంజీత, తదన్నం సంమతం సతామ్ 32

స్వం = సొమ్ము = బ్రహ్మజ్ఞానికి సంబంధించిన ధనము బ్రహ్మత్వమే సన్న్యాసి బ్రహ్మజ్ఞాని, దర్భలు,నారబట్టలే బ్రహ్మస్వం. దానినెన్నడు పాడుచేయక, శ్రోత్రియుని ఇంటనుండు అన్నమునే భుజించును సామాన్యుల ఇంట భుజింపడు. తనగోత్రనామముల తెలుపడు. చెప్ప

వలసిందిగా పీడించిననూ బాధపడడు. సన్న్యాసులను, బ్రహ్మచారులను ఆదరించువారే సజ్జనులు వారు పెట్టేఅన్నము సన్న్యాసికి సమ్మతము,

యథాస్వం వాంత మశ్నాతిశ్వావై నిత్యమ భూతయే
ఏవం తే వాంత మశ్నంతి స్వవీర్య స్యోప సేవనాత్॥ 33

వాంతము = క్రక్కబడినది = ఎంగిలి-తనగొప్పతాను చెప్పుకొనుట వాంతమే యగుచున్నది. కుక్కతాను క్రక్కినదానినే తినును. తనవీర్యమును తానే తినినట్లగును. తన గొప్ప చెప్పుకొని భిక్షమడుగరాదు. తాను ధర్మముచేసి, దానిని తిరిగి తీసుకొనుటకూడా వాంతమే.

నిత్యమజ్ఞాత చర్యామే ఇతిమన్యేత బ్రాహ్మణః
జ్ఞాతీనాంతు వసన్ మధ్యేతం విద్బ్రాహ్మణం బుధాః॥ 34

బ్రహ్మవేత్తయే బ్రాహ్మణుడు. అట్టివాడు తనదిన చర్య నెవరికిని తెలియనీయడు, ఆతడు జ్ఞాతుల నడుమనున్ననూ వారినుండి యేమియును స్వీకరించడు. వారితో ఎటువంటి సంబంధమూ పెట్టుకొనడు,

కోహ్యనన్తర మాత్మానం బ్రాహ్మణోహన్తుమర్హతి
నిర్లింగ మచలం శుద్ధం సర్వద్వైత వివర్జితమ్॥ 35

పరమాత్మకు యెక్కువ తక్కువ యను అంతరము = బేధము లేదు అట్టి పరమాత్మను బ్రాహ్మణుడైనంత మాత్రాన ఎవడునూ తెలుసుకొనలేడు చేరలేడు పరమాత్మకు స్థూల, సూక్ష్మ మొదలగు లింగభేదములు లేవు. సుఖ దుఃఖాదిద్వైత భావములు లేవు ద్వంద్వములు లేవు

తస్మాద్ధి క్షత్రియస్యాపి బ్రహ్మవసతి పశ్యతి 36

పైనపేర్కొన బడి నట్లు మెలగుట వలననే క్షత్రియ సన్న్యాసి యైనను పరమాత్మను చూచును, యోగనిష్ఠలో పరమాత్మ నధివసించును (ఏ జాతికిచెందిన సన్న్యాసియైనను, పైనచెప్పిన నియమము లు ముఖ్యము)

(29 వ. శ్లో॥ నుండి 36 వ. శ్లో॥ వరకు సమీక్ష)

విద్వాంసుడు, సన్న్యాసి, విద్వత్ సన్న్యాసులను గూర్చి చెప్పబడినది. ప్రతి ఒక్కరు కామ్యకర్మ సన్యాసము కావించి బ్రహ్మనిష్ఠులైనచో తప్పక ముక్తులగుదురు. నాల్గు ఆశ్రమములలోని వారు ధర్మతత్పరులై

నిష్కామ కర్మలచేయవలయును, సన్న్యాసుల నాదరించవలెను. వారి ఇండ్లకే సన్న్యాసులు భిక్షకు పోవలెను.

యోఽన్యథాసంతమాత్మాన మన్యథా ప్రతిపద్యతే
కింతేన నకృతం పాపం చౌరేణాత్మాపహారిణా ॥ 37

పరమాత్మ సచ్చిదానందా ద్వితీయుడు. కాన 'సత్' అగు చున్నాడు అట్టి బ్రహ్మస్వరూపము సామాన్యులకు ఆత్మగా తోచు దేహాదుల కంటె భిన్నమైనది. అట్టి పరమాత్మను దేహేంద్రియములుగా భావించువాడు మహాపాపాత్ముడే యగుచున్నాడు వాడు ఆత్మకాని దానిని ఆత్మగా భావించిన కారణమున, వాడు ఆత్మాపహారి అయిన చోరుడేయగు చున్నాడు.

విశే - నేను పరమాత్మను చక్కగా తెలిసికొంటిని అను అహంకారి మిక్కిలి పాపాత్ముడేయగుచున్నాడు. ఎందుకనగా పరమాత్మ జ్ఞాన స్వరూపుడు నిర్లింగుడు, శుద్ధుడు, అట్టి సత్స్వరూపమైన ఆత్మను "నేను కర్తను, భోక్తను, బ్రాహ్మణుడను, క్షత్రియుడను" అనుకొను మూర్ఖుడు, తనను తాను తెలుసుకొనలేక ఆత్మాపహారియే యగు చున్నాడు

అశ్రాంతస్స్యాదనాదనాన్సంమతో నిరుపద్రవః
శిష్టోనశిష్ట వత్సస్స్యాత్ బ్రాహ్మణోబ్రహ్మవిత్కవిః 38

దేహేంద్రియాదులు ఆత్మగా భావించనివాడే అనాదాతయగును. అనాదాత సంసారశ్రమలేనివాడగును. అతడే అందరికీ సమ్మతుడు. కామక్రోధాది రూపములయిన యుపద్రవములతని కుండవు. అతడు శిష్టుడయిననూ శిష్టునివలె యుండడు అట్టివాడే బ్రహ్మవేత్తయు, కవి = క్రాంత దర్శి యగును. అతడే బ్రాహ్మణుడు.

విశే :- అశ్రాంతుడు = సంసార శ్రమలేని వాడు. ''అశనాయాపిపాసే ప్రాణస్య। శోకమోహౌమనసోజరామరణే శరీరస్య = అకలి దప్పులు

ప్రాణధర్మములు, శోకమోహములు మనోధర్మములు, జరామరణములు దేహధర్మములు, నేను పరమాత్మ నెరిగితిననువాడు దురభిమాని దురహంకారి, ఆదానము = సంగ్రహించుట

అనాథ్యామానుషేవిత్తే ఆఢ్యాదైవే తథాక్రతౌ
తేదుర్ధర్షా దుష్ప్రకంప్యాస్తాన్విద్యాద్బ్రహ్మణస్తనుమ్ 39

బ్రహ్మవేత్త మానుష విత్తమునందు ఆసక్తి లేకుండును దైవవిత్తమునందాసక్తి కలిగియుండును క్రతువు నందాసక్తి కలిగి యుండును. అట్టివాడే బ్రహ్మతనువు = బ్రహ్మస్వరూపుడు అందుచే బ్రహ్మవేత్తను ఎవరును ఎదిరింపజాలరు అట్టి వాడెప్పుడును దుష్ప్రకంప్యుడౌ = నిర్భయుడేనని తెలుసుకొనవలయును

విశే :- అమృతంచైవ మృత్యుశ్చ ద్వయందేహేప్రతిష్ఠితమ్
మృత్యుమాపద్యతే మోహాత్, సత్యేనామృతమశ్నుతే

దేహమునకు అమృతత్వమూ, మృత్యువు అను రెండునూ కలవు. మానవులు మోహము చేత మృత్యువును, సత్యజ్ఞానముచే అమృతత్వమును పొందెదరు.

సర్వాన్ స్విష్టకృతోదేవాన్విద్యాద్య ఇహకశ్చన
న సమానో బ్రాహ్మణస్య యస్మిన్ ప్రియతతేస్వయమ్ 40

బాగుగ ఇష్టమును చేకూర్చువారే స్విష్టకృత్తుడు ఫలాపేక్షతో దేవతలనుద్దేశించి యాగములు చేయు స్విష్టకృత్తులు కూడ బ్రహ్మజ్ఞాని అయిన బ్రాహ్మణునితో సమానుడు కాడు వానిలో త్యాగము లేదు. ఫలదాతలైన దేవతలు కూడ నిష్కాముడయిన బ్రహ్మజ్ఞానికి సమానులు కారు. మానము = అభిమానము ఇది సంసారుల కుండవలయును, మౌనము = తత్త్వజ్ఞానము జ్ఞానుల కుండవలసినది.

యమప్రయతమానంతు మానయంతి సమానితః
సమాన్యమానోమన్యేత, సమాన్యమభిసంజ్వరేత్ 41

బ్రహ్మవేత్త తానెట్టి గౌరవమును పొందుటకూ ప్రయత్నించడు. తానే పని చేసినను ఫలము నపేక్షింపడు వాని మహిమ నెఱిగి కొందరతనిని కీర్తించెదరు. అజ్ఞానులు నిందించెదరు. పొగడ్తలకు పొంగిపోడు. నిందలకు క్రుంగిపోడు.

లోకస్వభావవృత్తిర్హినిమేషోన్మేషవత్తదా
విద్వాంసోమానయంతిహ ఇతిమన్యేత మానితః 42

కన్నులు మూసికొనుట, తెరచుకొనుట అది వాటి సహజగుణము అయితే తనకు గౌరవము పొందనర్హత లేకున్నను, తనను గౌరవించుట విద్వాంసుల లక్షణమని బ్రహ్మవేత్త భావించును.

అధర్మనిపుణామూఢాలోకే మాయావిశారదాః
నమాన్యం మానయిష్యంతి మాన్యావామవమానినః 43

మూఢులు అధర్మము చేయుటలో నిపుణులు వారికి వివేకము లేదు మాయ చేయుటలో ఆరితేరినవారు. వారు పూజ్యులను గౌరవించరు పైగా అవమానించెదరు ' అని బ్రహ్మవేత్త భావించునే గాని, అవమానించబడితినని బాధపడడు.

విశే ఆ. – నీలకంఠభాష్యము – "అథయోఽన్యాం దేవతాముపాస్తే అన్యోఽసావాన్యోఽహమస్మీతి ననవేదయథా పశురేవ నదేహానామితి" = యజ్ఞము చేసినను, అన్యదేవతలనుపాసించినను "బ్రహ్మము వేరు, నేను వేరు" అను అజ్ఞాన స్థితిలో యుండుటచే యజ్ఞకర్త దేవపశువుగా భావింపబడును. అట్టి దేవపశువైన వాడే తానితరులచే పూజితుడైనట్లు భావించును. యజ్ఞము చేసినను తానే పూజ్యుడనని భావించక, ఇతరులు తన నవమానించిననూ లెక్కచేయక యుండువాడే బ్రహ్మజ్ఞానియగును. స్వర్గసౌఖ్యముల నాశించి యజ్ఞయాగాదులచేయు వాడు దేవపశువు. దేవులనగా ఇంద్రియములు ఇంద్రియముల కోరికల ప్రకారము కర్మల చేయువాడు. పశుతుల్యుడు, పశుకాముడు కావున దేవపశువు బ్రహ్మజ్ఞాని దేవపశువు కాడు.

నవై మానంచ మౌనంచ సహితౌ వసతస్సదా
అయంహి లోకేమానస్య అసౌమౌనస్య తద్విదుః ॥ 44

లోకమున మానము, మౌనము అను రెండును పరస్పర విరోధులు, అవి రెండును ఒకచోట కలిసియుండవు, మానమున కాశ్రయము ఈ లోకము, మౌనమున కాశ్రయము పరలోకము. తత్ పదార్థమైన పరబ్రహ్మమును మౌనముగలవారు మాత్రమే తెలుసు కొందురని పెద్దలు చెప్పుచున్నారు.

విశే ఆ :- ఎల్లప్పుడును ప్రత్యక్షాది ప్రమాణములకు గోచరమైన ఈ ప్రపంచము మానము. మౌనము గా నున్నవాడే పరమును చేరగలడు. పరబ్రహ్మము నెవరు తెలిసికొనిరి? అని సందేహింప పనిలేదు, ఓంకారమే సత్పదార్థ మైన బ్రహ్మము అదిమౌనము, బ్రహ్మమును ప్రాప్తింపచేయును, ప్రతి ప్రాణికినీ మానముచే సంసారము ప్రాప్తించును.

"అన్నాంగనాది భోగేషు భావేమాన ఇతిస్మృతః
బ్రహ్మానంద సుఖప్రాప్తి హేతు ర్మౌన మితిస్మృతః॥

అన్నము, అంగనలందలి కోరికలు మానము బ్రహ్మానంద సుఖము లకు కారణము మౌనము.

శ్రీః సుఖస్యేహ సంవాసః సాచాపి పరిపంథినీ
బ్రాహ్మీసుదుర్లభా శ్రీర్హి ప్రజ్ఞాహీనేన క్షత్రియ॥ 45

క్షత్రియా! లోకమున శ్రీ రెండు విధము లుగా నున్నది. ఒకటి ధనలక్ష్మి రూపము రెండవది బ్రాహ్మీరూపము. (మోక్షము). దీనిలో ధనరూపమగు శ్రీ సుఖమునకు నిలయము. అది మోక్షపురుషార్థమునకు శత్రువు బ్రాహ్మీశ్రీ ప్రజ్ఞకు నిలయము. అది ప్రజ్ఞాహీనునికి సుదుర్లభమైనది

విశే, ఆ - "యానిత్యాచిద్ఘనానందా గుణరూప వివర్జితా
ఆనందాఖ్యాపరాశుద్ధా బ్రాహ్మీశ్రీరితి కథ్యతే

బ్రాహ్మీశ్రీ = నిత్య, చిద్ఘనానందరూపిణి = త్రిగుణములు లేనిది, 'ఆనంద యను నామము కలది. అదియేపరా, శుద్ధా = ఇదిమానార్థులయిన సుఖశీలురకు లభింపదు.

ద్వారాణి తస్యేహవదంతిసంతో। బహు ప్రకారాణి దురాచరాణి।
సత్యార్జవే హ్రీర్దమః శౌచవిద్యా। షణ్మాన మోహప్రతిబంధకాని॥ 46

బ్రాహ్మీశ్రీ ప్రాప్తి కి బహుప్రకారములైన సాధనములు కలవని సజ్జనులు చెప్పుచున్నారు అవి సామాన్యముగ ఆచరింప బడలేనివి వాటిని సంర క్షించు కొనుట కూడ కష్టము. అవియేవియనగా. 1 సత్యము = య దార్థసంభాషణము. 2 ఆర్జవము = కౌటిలక్యము లేకుండుట 3 హ్రీ = చెడ్డకార్యములు చేయుటలో లజ్జ = లోకాప వాదమునకు భయపడుట 4 దమము = ఇంద్రియ నిగ్రహము 5 శౌచము = దేహ మనస్సుల ను నిర్మలముగ నుంచుట 6. విద్య = బ్రహ్మజ్ఞానము పై అరుద్వార ములు గలవారి చెంతకు మోహము చేరదు.

ద్వితీయాధ్యాయ సమాప్తం

## శ్రీ సనత్సుజాతీయము

### తృతీయాధ్యాయము

అవ - ఈ అధ్యాయమున బ్రహ్మజ్ఞాన సాధనములగు మౌనాదుల లక్షణములను, గుణదోష స్వరూపములను వివరింపబడు చున్నవి.

ధృతరాష్ట్ర ఉవాచ ,-

కస్యైషమౌనం కతరన్నుమౌనం ప్రబ్రూహి విద్వన్ ఇహమౌనభావం
మౌనేన విద్వానుతయాతిమౌనం కథంమునే మౌనమిహా చరన్తి॥ 1

ము నీశ్వరా! మౌనము ఎట్టివానికి అలపడుతుంది? మౌనమనగా నేమి? విద్వాంసుడుమౌనము చేతనే మౌనమును పొందు చున్నాడా? ఇహలోక మున మౌనము నెట్లాచరించుచున్నారు? మీరు విద్వాంసులు కాన మౌన భావమును వివరించండి.

విశే అ .- అయ్యా! మృత్యువు అహంకార స్వరూపము. మోహాత్మక ము, సత్యాదులు దానిని నిరోధించునంటిరే అదెట్లు? న్యాస పూర్వకము గా స్వీకరించుము ని ధర్మమే మౌనమా? దాని ప్రయోజనమేమి? లోక ప్రసిద్ధమైన వాఙ్నియమమే మౌనమా? శ్రవణ, మననాదులచే నిధిధ్యా సము మౌనమా? దాని లక్షణమేమి? మనసు, ప్రాణము లు, ఇంద్రియ

ములు-అనువాటి కృత్యముల నిరోధించుట మౌనమా? అట్టిమౌనము నెట్లాచరించుచున్నారు?

సనత్సుజాత ఉవాచ –

యతోనవేదా మనసాసహైన మనుప్రవిశంతి తతోఽథమౌనమ్
యత్రోత్థితోవేద శబ్దస్తథాయం సతన్మయత్వేన విభాతి రాజన్॥ 2

రాజా! వేదములు, మనస్సు పరమాత్మను తెలుసుకొనలేవు మౌనమన గా పరబ్రహ్మమని కొందరు పెద్దలు చెప్పిరి. వేదములను తెలుపు వేద శబ్దము పరమాత్మబోధకమని శాస్త్రాదులు తెలుపు చున్నవి రాజా! వేదాదులను పరిశీలించగా, పరమాత్మ తన్మయుడుగా, అనగా జ్యోతిర్మయుడుగా ప్రకాశించుచున్నట్లు తెలియుచున్నది.

విశే. అ – పరమాత్మ స్వరూపమును ఇదమిత్థమని చెప్పలేనట్లే. మౌనమును కూడ చెప్పలేము. పరబ్రహ్మ వాచకముగ మౌనశబ్ద మేర్పడినది "ముని కర్మమౌనము" –మునిఎవరు? ఋషి,ఎవడు?" నిర్విత్తః, సర్వ తత్త్వజ్ఞః, కామ, క్రోధ వివర్జితః ధ్యానస్థో, నిష్క్రియో, దాంతస్తుల్య మృత్కాంచనో మునిః" = తత్త్వవేత్త, ధర్మిష్ఠుడు, కామక్రోధములు లేనివాడు ధ్యాననిమగ్నుడు. నిష్క్రియుడు, మట్టిని, బంగారును సమముగా చూచువాడు ముని అందుచే ముని పరబ్రహ్మ స్వరూపుడు, ఋషియనగా, "తపశ్చాచ పరాదాంతా సత్యవాచో బహుశ్రుతాః వేద వేదాంగ తత్త్వజ్ఞానః ఋషయః పరికీర్తితాః ఊర్ధ్వరేతాస్తపస్యుగ్రో నియతాసీచ సమ్యమీ శాపాను గ్రహయోశ్శక్తః సత్యసంధోబవేదృషిః॥ అందుచే మునియన్నను, ఋషియన్నను పరబ్రహ్మ స్వరూపమే 'బ్రహ్మ విద్ బ్రహ్మైవ భవతి"-అట్టిపరమాత్మ ఓంకారరూపుడు ఆఓంకారము నుండియే స్థూల, సూక్ష్మ, కారణ జగత్తులు, శరీరములు పుట్టినవి. ఇవన్నియును మౌనమైన పరమాత్మ నుండియే పుద్భవించినవి.

నీలకంఠభాష్యము :– ధృతరాష్ట్రుని ఐదు ప్రశ్నలకును సనత్సుజాతుడు తాంత్రికముగ సమాధానము చెప్పుచున్నాడు"రాజా! పరబ్రహ్మము

వాఙ్మన సాతీతుడు అతనికి మౌనమని పేరు. ఆ పరబ్రహ్మమును పొందుటయే మౌనమునకు ప్రయోజనము. ఇంద్రియములను,మనస్సును నిగ్రహించుటయేమౌనముమునికిబాహ్యాభ్యంతరజగత్తులు భాసించవు, అపుడే ముని బ్రహ్మపదమును పొందుచున్నాడని నాలుగు ప్రశ్నలద్వారా సమాధానము చెప్పెను ఇక ఐదవ ప్రశ్నకు సమాధానం-క్షేత్రమునందు అంకురమును సముద్రమునందు తరంగములును, పుట్టినట్లే, పరబ్రహ్మములో వేదశబ్దమును, లౌకిక శబ్దమును కలిగినవి అందుచే భూతాత్మ అయిన పరమాత్మ శబ్దమయుడుగ ప్రకాశించుచున్నాడు వేదమనగా ప్రణవమే ఓకారంము. అది ఏకమైన అక్షర పరబ్రహ్మ. ఋగ్వేదము నుండి "భూః" యజుర్వేదము నుండి "భువః'' సామవేదము నుండి "స్వః" అనునవి ప్రభవించినవి. అవియే శుక్రములు = తేజస్సులు. వాటి నుండి అ. ఉ. మ. అనుమూడు వర్ణములు కలిగెను. అవి యేకమై ఓంకారముగ వెలసెను వాని నుండి స్థూల, సూక్ష్మ, కారణ ప్రపంచములు కలిగెను. పైమూడు మాత్రలు, పైమూడు ప్రపంచములకు వాచకములు వాచ్య, వాచకముల కభేదము కావున వేదశబ్దము పరమాత్మవాచకము, ప్రపంచ వాచకము కూడా అయెను. పైమూడు మాత్రలలో పూర్వ, పూర్వ పూర్వము, ఉత్తర ఉత్తరము లందు లీనమై ఓంకార రూపము చాల్చెను లవణమే ఉదకమాయెను ఉదక మేలవణమాయెను. ఇవన్నియు అర్ధమాత్రయైనతురీయములో లీనమగును. కావున పరబ్రహ్మము ఒక్కటియే అంతటను ప్రకాశించుచున్నది ఆవేదశబ్దమే నారాయణుడు, అతడే మౌనము

ధృతరాష్ట్ర ఉవాచ :-

ఋచోయజూంష్యధీతేయః సామవేదంచ యోద్విజః
పాపాని కుర్వన్ పాపేనలిప్యతే కిం నలిప్యతే॥ 3

అయ్యా! ఋగ్యజుస్సామవేదములను పఠించిన యతడు పాపములను

చేయుచున్నను, ఆపాపములను వేద పఠనము వల్ల పోగొట్టుకోనునా లేదా?

సనత్సుజాత ఉవాద –

నైనం సామాన్యృచోవాఽపి నయజూంష్యవిచక్షణం
త్రాయన్తే కర్మణః పాపాన్నతే మిథ్యా బ్రవీమ్యహం॥ 4

రాజా! పాప కర్మల నాచరించు వానిని ఋగ్యజుస్సామ వేద పఠనము పాపము నుండి రక్షింపదు. నేనెన్నడూ నీకు మిథ్యావచనములను చెప్పను. అని చక్షణుడు = నిషిద్ధ కర్మల నాచరించువాడు. వానికి మనోవాక్కాయ నిగ్రహముండదు

నచందాంసివృజినం తారయంతిమాయావినంమాయయా వర్తమానం
నీడంశకుంతా ఇవజాత పక్షాశ్ఛందాంస్యేనం ప్రజ హన్త్యన్త కాలే॥ 5

మాయావియు మాయతో ప్రవర్తించు వాడునగు మానవుని వేదము లెంత మాత్రమును పాపము నుండి రక్షింపవు రెక్కలు వచ్చిన పక్షులు గూటిని విడిచి పెట్టినట్లు మరణ కాలమున పాపాత్ముని వేదములు విడిచి పెట్టును. రక్షింపవు, వానికి మరణ సమయమున అవిన్ఫురణకు రావు.

ధృతరాష్ట్ర ఉవాచ –

నచేద్వేదా వినాధర్మం త్రాతుం శక్తా విచక్షణ
అథక స్మాత్ ప్రలాపోఽయం బ్రాహ్మణానాం సనాతనః॥ 6

నాలుగు జాతుల వారికిని విధించిన ధర్మము రక్షించునట్లు మరేవియు మానవులను రక్షింపజాలవు ఓవిచక్షణా! అదే నిజమైనచో వేదములందు మహత్త్వముగలదు వేదవేత్తలే గొప్పవారు" అని అనాదిగా వినబడుచున్న మాటలు అప్రమాణము లేనా? వేదములు వేదవిదుని రక్షింపజాలవేని, వేదాధ్యయనమును,వాటి అర్థవిచారమును వాటి అను ష్టానమును కర్తవ్యములు అనే వ్యర్థ ప్రలాపములు ఎందుకు?

(మీమాటల వలన వేదపఠనము నిష్ఫలముగా తోచుచున్నదే!)

సనత్సుజాత ఉవాచ –

తస్యైవనామాది విశేషరూపై! రిదంజగద్భాతి మహానుభావ।
విర్దిశ్యసమ్యక్ప్రవదన్తి వేదా। స్త ద్విశ్వవైరూప్యముదాహరన్తి॥ 7

మహానుభావా! పరమాత్మయొక్క నామరూపములు, పరమాత్మమాయ చే కల్పింపబడినవే, పరమాత్మ నామ రూపాదులతోడనే ఈజగమంత యు భాసించుచున్నది. వేదములు పరమాత్మ యొక్క స్వరూపమును, ఆయామంత్రముల మూలమున చక్కగా నిర్దేశించి చెప్పుచున్నవి. అంతే కాదు. అవి పరమాత్మ యొక్క విశ్వ వైరూప్యమును చక్కగా ఉదహ రించి చెప్పు చున్నవి.

విశే. అ :- మూడవ శ్లోకమునుండి ఏడవ శ్లోకము వరకు గలవానిలో వేదప్రామాణ్యము, వేదప్రభావము, వేదఆవశ్యకత, వేదప్రయోజనము లు వివరింపబడినవి. వేదము = జ్ఞానము,విష్ణువు, బ్రహ్మ, వేదములు అనినానార్థములు కలవు వేదములు సూటిగాగానీ, పరంపరగా గానీ జ్ఞాన మును తెలియజేయుచున్నవి. అందుచే వేదపఠనము, వేద శ్రవణము న్ను పాపనాశకము, మోక్షదాయకము యగుననిచెప్పవచ్చును వేదోక్తము లైన యజ్ఞయాగాదులను నిష్కామముగా చేసినచో ముక్తినొసగును. సకామముగా చేసినచో సంసారబంధము, పునర్జన్మలు కలుగును.

నాలుగు వర్ణములకు చెప్పిన ధర్మము లను బ్రహ్మార్పణ బుద్ధితో చేసి నచో మానవులను రక్షించును. రక్షణమనగా మోక్షము. "ధర్మో రక్షతి ధార్మికం", ఈ కానవచ్చు ప్రకృతి యంతయు పరమాత్మ యొక్క విశ్వ వైరూప్యమనియే వేదములు చాటుచున్నవి, వేదములు చెప్పురీతిని ఆయాదేవతలను పరమాత్మగా భావించి ఉపాసించినచో మోక్షము ప్రాప్తించును. అంతేకాదు. నాలుగు వేదములు, శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము , జ్యోతిషము, కల్పము, మీమాంస, న్యాయశాస్త్ర ము, పురాణములు, ధర్మశాస్త్రము, ఆయుర్వేదము , నీతిశాస్త్రము, అర్థ

శాస్త్రము, అనెడు పదునెనిమిది విద్యలందు చెప్పబడిన కర్మకాండఅంత యు, బ్రహ్మార్పణ బుద్ధితో ఆచరించినచో అంతఃకరణ శుద్ధిని చేకూర్చి తద్వారా మోక్షము నొసగును. కర్మానుష్టానములో అశ్రద్ధవహించరాదు. మానవులు చేయు సత్కార్యములు ఆరాధించు దేవతలు, చూచునట్టి వస్తువులు, పరమాత్మ విలసితములే. ఆవిషయమును శాస్త్రవేత్తలు, ఆ రోపదృష్టి అపవాదదృష్టి వ్యామిశ్రదృష్టి అనుపద్ధతులతో వివరించిరి.

తదర్థము క్తం తపఏతదిజ్యా తాభ్యా. మసౌపుణ్యము పైతివిద్వాన్
పుణ్యేనపాపం వినిహత్యపశ్చాత్ సజాయతే జ్ఞాన విదీపితాత్మా॥ 8

పరబ్రహ్మప్రాప్తికి తపస్సు యజ్ఞము, ముఖ్యముగాచేయవలె నని వేదములందు చెప్పబడినది తపస్సు, యజ్ఞములచేతనే విద్వాంసుడు పుణ్యము ను పొందుతున్నాడు బ్రహ్మార్పణ బుద్ధితో యజ్ఞాదులను ఆచరించుటచే కలిగున పవిత్రతయే "అపూర్వము" అదియేపుణ్యము. అట్టిపుణ్యముచే మానవుడు పాపమును క్షీణింపచేసుకొని, జ్ఞానమును పొందును జ్ఞానము చేతనే, పరమాత్మ స్వరూపమును చక్కగా తెలుసుకొనును

శం భా ,- తపోయజ్ఞాదులు సాక్షాత్తుగా మోక్షహేతువులు కావు జ్ఞాన ము ను ప్రసాదించుటకు సాధనములు మాత్రమే. ఈశ్వర ప్రాప్తికైచేసి నచో మోక్షము వచ్చును. కామవాంఛలతో చేసినచో సంసారమున తగులుకొనును

జ్ఞానేన చాత్మాన ముపైతి విద్వా నథాన్యథా వర్గ ఫలాను కాంక్షీ
అస్మిన్ కృతంతత్పరిగృహ్యసర్వమముత్రభుంక్తే పునరేతిమార్గమ్॥ 9

ఈశ్వరార్పణ బుద్ధితో యజ్ఞ, దాన, తపః కర్మల నాచరించుటయే జ్ఞాన ము. అట్టి జ్ఞానము చే విద్వాంసుడు పరమాత్మను వేరును అట్టి జ్ఞాన ము లేనివాడే అజ్ఞాని అజ్ఞానముచే మానవుడు స్వర్గము మున్నగు ఇంద్రియ సుఖముల నే కోరును. ఇహలోకమున కావించిన పుణ్యపాప

మూలను సంపూర్ణముగా స్వీకరించి స్వర్గ, నరకము లజేరును, స్వర్గనరకములలో ఆయాఫలముల ననుభవించి. కర్మశేషముచే భూలోక మార్గమును చేరును.

అస్మిన్‌లోకే తపస్తప్తం ఫలమన్యత్రభుంజతే।
బ్రాహ్మణా నామిమేలోకా ధాత్వేతపసి తిష్ఠతామ్॥ 10

ఈ లోకమున చేసిన తపఃఫలము పరలోకమున అనుభవించుట పండిత పామరు లందరికీ సమానమే బ్రహ్మజ్ఞానులు మాత్రమీ లోకమున చేసిన తపఃఫలమును ఈలోకము నందే అనుభవింతురు జ్ఞానులు తపస్సును "అవశ్యకర్తవ్య" మని భావించి చేయుదురు,

శం భా – "యదేవ విద్యయా కరోతి తదేవ వీర్యవత్తరం భవతి" తపస్సు "వీర్యవత్తరము" (సఫలము) అగుటకు విద్య, శ్రద్ధ, బ్రహ్మ సామీప్యస్థితి ముఖ్యకారణమని శ్రుతి చెప్పుచున్నది ఇవి విషయవాంఛా పరులైన వారి కుండవు. అందుచేతవారి తపస్సు ఇహలోకమున సమృద్ధములు కావు జ్ఞానుల తపస్సు ప్రత్యక్ష ఫలమొసగును.

నీల.భా –"స్వాధ్యాయప్రవచనే ఏవేతి, నాకోమౌద్గల్యః తద్ధి తపస్తద్ధితపః"-మౌద్గల్యఋషి వేదాధ్యయనములనే మోక్ష హేతువులని చెప్పెనుకదా! తమరు జ్ఞానమే మోక్షహేతువుకాని వేదపరనాదులు సూటిగా మోక్షహేతువులు కావనుచున్నారే! ఎట్లు? అనిశంకించవద్దు విద్వాంసుల తపస్సుకును, అవిద్వాంసుల తపస్సుకును భేదము కలదు. విద్వాంసులు కానివారికి శమదమాద లుండవు. బ్రహ్మజ్ఞాన విహీనులగు వారి యొక్క తపఃఫలములు పరలోకములో ననుభవించెదరు. బ్రహ్మజ్ఞానులు ఈ లోకముననే తమ తపఃఫలముల ననుభవించెదరు.

ధృతరాష్ట్ర ఉవాచ –

కథం సమృద్ధ మసమృద్ధం తపోభవతి కేవలమ్
సనత్సుజాత తద్బ్రూహి, యథా విద్యామతద్వయమ్॥ 11

మునిసత్తమా! తపస్సు సమృద్ధము , అసమృద్ధము అని రెండు విధము లుగా చెప్పుచున్నారే–వాటిని తెలుపుడి

సనత్సుజాత ఉవాచ –

నిష్కల్మషం తపస్త్వేతత్ కేవలం పరిచక్షతే
ఏతత్సమృద్ధ మప్యృద్ధం తపోభవతి కేవలమ్॥ 12

నిష్కల్మషమైన తపస్సే కేవలము మోక్షసాధనమని పెద్దలు చెప్పిరి అదియే సమృద్ధము ఋద్ధమని మరల రెండువిధములుగా నున్నది ఋద్ధతపస్సు అనగా తగినంతఫలము మాత్రమేయిచ్చునది సమృద్ధము అనగా సంపూర్ణ ఫలము నిచ్చునది

తపోమూలం సర్వం మన్మాం పృచ్ఛసి క్షత్రియ
తపసావేద విద్వాంసః పరంత్వమృత మాప్నుయుః॥ 13

క్షత్రియా! నీవడుగు చున్న తపస్సును గూర్చి చెప్పుచున్నాను వినుము లోకమున స్వర్గాదులేకదా భోగ్యవస్తువులు వాని నన్నింటినీ పొందుటకు తపస్సే మూల కారణము కాన వేద విద్వాంసులు మాత్రము నిష్క ల్మషమైన తపస్సుచేసి ఉత్కృష్టమైన అమృతత్వమును అనగా మోక్ష మును పొందెదరు

ధృతరాష్ట్ర ఉవాచ

కల్మషం తపసోబ్రూహి శ్రుతం నిష్కల్మషం తపః
సనత్సుజాత యేనేదం విద్యాం గుహ్యం సనాతనమ్॥ 14

అయ్యా! నిష్కల్మష తపస్సు చేతనే రహస్యమైనది, సనాతనమైనది, అగు బ్రహ్మపదార్థము తెలుసుకొన వీలుకలుగునని వింటిని. నిష్కల్మ షమగు తపస్సును గూర్చివింటిని నిష్కల్మషమగు తపస్సుండినచో, కల్మషతపస్సు ఒకటి యుండవలయును కదా! కల్మషమేదో తెలుపుము

సనత్సుజాత ఉవాచ –

క్రోధాదయో ద్వాదశయస్యదోషా స్తథా నృశంసాని షట్త్రిరాజన్
ధర్మాదయోద్వాదశైతేపిత్రృణాంశాస్త్రేగుణాయేవిదితాద్విజానామ్॥15

రాజ! తపస్సుకు చెందిన క్రోధాధి దోషములు పంన్రెండు కలవు అవి తపస్సుకు చెందిన కల్మషములు వానిలో ఏదు మహాక్రూరములై నవి వంశకర్తలైన మన్వాదులు పరమగురువులైన సనత్కుమార కపిలాదులు, ద్విజులు, వారుచెప్పిన శాస్త్రములలో తపస్సుకు చెందిన గుణములు పంన్రెండు కలవు అగుణములే ధర్మము, జ్ఞానము మున్నగునవి కొందరి మతమున తపస్సుకు చెందిన దోషములు పదమూడు కలవు ఆదోషము లేవో గుణములేవో చెప్పెదను, వినుము ధర్మాది గుణయుక్తమైన తపస్సే నిష్కల్మషమైనది అది మోక్షహేతువు, అని వంశకర్తలు, లోకమునకు పితరులు అయిన మనువులు చెప్పియున్నారు.

క్రోధః కామోలోభమోహౌ వివిత్సా కృపాఽసూయేమానశో కౌస్పృహాచ
ఈర్ష్యాజుగుప్సాచమనుష్యదోషావర్జ్యాస్సదాద్వాదశైతేనరాణామ్॥ 16

1 క్రోధము = కామప్రతిఘాతమున గలుగు చిత్తవిక్షేపమే క్రోధము 2 కామము = స్రక్చందన, వనితాదుల మీది అభిలాష. 3 లోభము = పరధనము మీద ఆశయు, న్యాయార్జిత విత్తమును ఉత్తమ పాత్రమునందర్పింప కుండుట 4 మోహము = కార్యాకార్యవిహీనత 5 విధిత్స = కామ్యకర్మలందు,తృష్ణాత్మకకర్మలయం:దాసక్తి 6 అకృప = కాఠిన్యము 7. అసూయ = ఇతరుల మంచిగుణములను దోషముగా ఆరోపించుట, పరగుణముల నైకరింపలేకుండుట 8. మానము = ఆత్మాభిమానము 9 శోకము = ఇష్టము లు పోయినప్పుడు కలుగుచిత్తవిక్షేపము 10 స్పృహ = విషయభోగకాంక్ష 11 ఈర్ష్య = పరులమేలును చూచి ఓర్వలేకుండుట 12 జుగుప్స = పరులగుణములను కప్పిపుచ్చుటకై తలంచుట ఈ పంన్రెండున్నూ తపస్సుకు కల్మషములు, అందరూ వీటిని వదలుకొనవలెను బ్రహ్మజ్ఞానమనుమహాగుణములుకలవాడు దీనిని తప్పక విడువవలెను వీటిని వదలనిచో దుర్గుణులై నరకమున పడెదరు

విశే, అ - యథాపాంథస్య కాంతారే సింహవ్యాఘ్ర మృగాదయః
ఉపద్రవకరాస్తద్వత్ క్రోధాద్యా దుర్గణా నృణామ్॥

సింహము, పెద్దపులి మున్నగు క్రూరజంతువులు దుర్గమ మార్గమున నుండి బాటసారుల నెట్లు హింసించునో, అట్లే క్రోధాది దుర్గుణములు మానవులకు ఉపద్రవములు చేకూర్చును

ఏకైకః పర్యుపాస్తేహ మనుష్యాన్ మనుజర్షభ
లిప్సమానోఽన్తరం తేషాం మృగాణామివలుబ్ధకః॥ 17

మనుజర్షభా! లోకమున వేటకాడు మృగములను వెదకుచు ఎట్లువెంబడించునో అట్లేపైన పేర్కొనిన క్రోధాదులలో ఒక్కొక్కటియే మనుష్యులలో గల లోపములను అన్వేషించి పొంచి, హింసించును, కావున మానవుడు వాటిని వదలవలెను.

వికత్థనః స్పృహయాళుర్మనస్వీ బిభ్రత్కోపశ్చపలోఽరక్షణశ్చ
ఏతాన్పాపాఃషణ్నరాఃపాపధర్మాన్ ప్రకుర్వతేనోఽత్రసంతస్సుదుర్గే॥18

శంఖా – పైన చెప్పిన దోషములేగాక పదమూడు మహాదోషములు గలవు. వానిలో ఆరు పాప ధర్మములు వానిని పాపాత్ములు తప్పక ఆచరించెదరు అవి సజ్జనుని సైతము హింసించును. వాటిని ఆచరించు వారు (1) వికత్థనుడు = పరగుణములను ఆక్షేపించుచూ తన గుణ ములను గొప్పగా చెప్పుకొనువాడు (శిశుపాలుడు) (2) స్పృహ యాళువు = పరకాంతాదుల భోగముల ననుభవించగోరువాడు (సైంధ వుడు-రావణుడు) (3) మనస్వి = గర్విష్ఠుడై పరుల నవమానించు వాడు (విశ్వామిత్రుడు వసిష్ఠుని చేసినట్లు) (4) బిభ్రత్కోపుడు = కోపిష్ఠి, (తక్షకుడులాటివాడు) చపలుడు = స్థిర బుద్ధిలేనివాడు (6) అరక్షణుడు = శక్తి కలిగియు తనమీద ఆధారపడిన వారిని రక్షిం పని వాడు (లేక) రక్షణుడు = లోభి అయిన ధనవంతుడు (లేక) రూక్షణుడు =పరుషముగా మాట్లాడువాడు

సంభోగసంవిద్విషమోఽతిమానీ దత్త్వానుతాపీకృపణోఽబలీయాన్
వర్గప్రశంసీ వనితా నుద్వేష్టా ఏతేపరే సప్త నృశంసవర్గాః॥ 19

సంభోగసంవిత్తుడు = ఇంద్రియ సుఖసమ్మేళనమును వాంఛించువాడు = వనితాది సుఖములకోరువాడు 2 విషమేథమానుడు = విషమును బోలు మహోపద్రవము చే పరులను పీడించువాడు 3 దత్తానుతాపి = ఒకసారి దానముచేసి ఆదానము చేసినందుకు విచారించువాడు 4 కృపణుడు= లేశమంత ధనలాభమునకై సకల అవమానముల సహించువాడు-తనుతినడు, ఒకరి కివ్వడు 5 అబలీయాంశుడు = జ్ఞానబలము లేని వాడు, శత్రు రాజులనుండి యేగాక, తనప్రజలను కూడ పీడించి ధనము గుంజువాడు-బలీయాంశుడు = శరీరబలముతో ఇతరులను పీడించువాడు 6 వర్గప్రశంసీ =వర్గమనగా వృజినము= ఇతరులను హింసించి ఆనందించువాడు త్రివర్గములైన ధర్మార్థ కామములను ప్రశంసించువాడు పరుల మనస్సును ఆకర్షించుటకై పరవర్గములను ప్రశంసించువాడు (7) వనితా సుద్వేష్టా= అనన్యశరణలు గుణవతులునగు స్త్రీలను ద్వేషించువాడు (భార్యనుకూడ) ఈ ఏడు మంది ఘాతకులు-పాపధర్ములు

> ధర్మశ్చ సత్యంచ దమస్తపశ్చ అమాత్సర్యంహ్రీస్తి తిక్షాఒనసూయా
> యజ్ఞశ్చదానంచ ధృతి శ్శ్రుతంచవ్రతానివై ద్వాదశబ్రాహ్మణస్య॥ 20

1 ధర్మము =వర్ణాశ్రమధర్మము-ఆదిశంకరుడు ధర్మమునకు బదులు జ్ఞానమును తీసుకొనెను అనగా తత్త్వార్థ సంవేదనమే జ్ఞానము (2) సత్యము= భూతహితముగా యదార్థ భాషణము, (3) దమము = మనోనిగ్రహము (4) తపస్సు, (5) అమాత్సర్యము = పరులగొప్ప గుణముల మెచ్చుకొనుట, (6) హ్రీ= చెడ్డ పనులు చేయుటచే కలుగు సిగ్గు, (7) తితిక్ష= సుఖ, దుఃఖముల ద్వంద్వములను సహించుట (8) అనసూయ= ఇతరుల గుణములందు దోషము లారోపింపకుండుట (9) యజ్ఞము= అగ్నిష్టోమాది యజ్ఞములు, (10) దానము= సత్పాత్రము నందు సమర్పించు దానము (11) ధృతి= విషయ సాన్నిధ్యమున ఇంద్రియనిగ్రహము, (12) శ్శ్రుతము= మంత్రార్థమున

తెలుసుకొనుట, (శంకరులు ధృతికి బదులు శమమును స్వీకరించిరి శమము:– అంతరింద్రియనిగ్రహము, ఈ పండ్రెండు గుణములును బ్రాహ్మణునకు వ్రతములనబడును

యస్త్వేతేభ్యః ప్రభవేతద్వాదశభ్యః సర్వానపీమాంపృథివీంసశిష్యాత్
త్రిభిర్ద్వాభ్యాం ఏకతోవార్థితోయః తస్య స్వమస్తీతి సవేదితవ్యః 21

ఈ పండ్రెండు గుణము లు గలవాడు ఈ మహీమండలమంతటినీ శాసించుచూ తన పిడికిట నుంచుకొను ననుటలో సందేహము లేదు వానిలో మూడో, రెండో లేక ఏ ఒక్క గుణమయినను సరే ఎవ్వనిలో వుండునో వాడు బ్రహ్మజ్ఞాన సంపన్నుడై బ్రహ్మమే యగును

దమస్త్యాగోఽప్రమాదశ్చ ఏతేష్వఽమృత మాహితం
తానిసత్య ముఖాన్యాహుః బ్రాహ్మణాయే మనీషిణ ॥ 22

ఇంద్రియ విజయమే దమము. ఈశ్వరార్పణ బుద్ధితో కర్మల నాచరించుటయే త్యాగము భగవత్తత్వాను సంధానమే అప్రమాదము ఈ మూడు గుణములు కలవాడు తప్పక ముక్తుడగును పై గుణము లకు తోడు సత్యగుణము ప్రధానముగా కలిగియుండవలయునని బ్రాహ్మణులు పలికిరి

దమోహ్యష్టాదశ గుణః ప్రతికూలం కృతాకృతే।
అనృతం చాభ్యసూయాచ కామార్థౌ చ తథాస్పృహా ॥ 23
క్రోధశ్శోకస్తథాతృష్ణా లోభః పైశున్య మేవచ।
మత్సరశ్చ విహింసా చ పరితాపస్తథారతిః ॥ 24
అపస్మారశ్చాతివాదస్తథా సంభావనాత్మని
ఏతైర్విముక్తో దోషైర్యః సదాంత సద్భిరుచ్యతే ॥ 25

మున్ముందు చెప్పబోవు దోషములు పదునెనిమిది అవి మనో నిగ్రహరూపమును ఇంద్రియ విజయరూపమును యగు దమమునకు ప్రతికూలములు, వానిని వీడినచో దమము పదునెనిమిది రెట్లు పెరుగును,

1 ప్రతికూలము = వేదోక్త కర్మలు చేయునపుడు అశ్రద్ధ, ఆలస్యము ఉపవాసమునకు ఆకలి వంటివి దమమునకు కృతమనగా సుకృతము అకృతమనగా దుష్కృతము ఇవి రెండును ప్రతికూలములే అనగా విరోధములే ప్రాతి కూల్యము దుఃఖహేతువే ఉదా॥ తపస్సు చేయుట కష్టము చేయుచున్నచో, తపస్సు చేయకపోతినే యన్న దుఃఖము 2 అనృతము = అబద్ధము చెప్పుట 3 అభ్యసూయము = పరుల గుణములందు దోషములు చూపుట 4 కామము = స్త్రీభోగముల కోరుట 5 అర్థము = ధనార్జనకై ప్రయత్నము 6 స్పృహ = ధనము వల్ల కలుగు సుఖమునందు ఆశ 7, క్రోధము = కోరికలు తీరనప్పుడు కలుగు అగ్రహము 8 శోకము = సుఖాభావముచే కలుగు దుఃఖము 9 తృష్ణ = ఐహిక జీవనముపై ఆశ 10 లోభము = ధనాపేక్ష 11 పైశున్యము = పరుల దోషములను చూపుట 12 మత్సరము = ఇతరుల అభివృద్ధిని సహింప కుండుట 13 హింస = ఇతరులను బాధించుట 14 పరితాపము = అల్పదుఃఖమున కైనను అతిగాదుఃఖించుట 15 అరతి = సత్కార్యములందు అభిలాష లేకుండుట 16 అపస్మారము = కర్తవ్యమును విస్మరించుట 17 అతివాదము = నిరర్థకమైన అతిప్రసంగము దానివల్ల ఇతరులపై ఆక్రోశించుట 18 ఆత్మసంభావన = ఆత్మస్తుతి = తననుతాను పొగడు కొనుట

మదోఽష్టాదశ దోషస్స్యా త్త్యాభోగోవతి షడ్విధః
విపర్యయా స్స్మృతా ఏతే మదదోషా ఉదాహృతాః॥ 26

మదమునకు కూడా పదునెనిమిది దోషములు కలవు అనృతము, మొదలు హింసవరకు పదునెనిమిది దమదోషములును వ్యతిరేకముగా నున్నచో మదనాశకరములైన దోషము లుగా చెప్పబడినవి అవివిమనగా 1 సత్యము 2 అపైశునము 3, అతృష్ణ 4, అప్రాతికూల్యము 5 తమస్సు లేకుండుట, 6 అరతి 7 లోకమునుప్రేమించుట 8 అనభిమానము 9, అవివాదము 10 అహింస 11 అపరివాదము (అనతివాదము)

12 మాత్సర్యము లేకుండుట 13 అపరితాపము 14 అక్షమం 15 ధృతి 16 సిద్ధి 17 అపాపకృతి 18 అహింస ఇవి మదమును, నశింప జేయును శమమును లోపింపజేయు కారణమున దమదోషములనే శమ దోషములుగా చెప్పిరి

ఇకచెప్పబోవు షడ్విధత్యాగములకు విపర్యయము లు ఆరుకలవు అవి యేవనగా 1 లక్ష్మిప్రాప్తించినచో కలుగు హర్షము 2 అప్రియము కలిగినప్పుడు పొందు దుఃఖము 3 స్వంతానికియాచించడము 4 అపాత్రదానము 5 అర్హత వుండి కూడా ఇష్టాపూర్తములు చేయకుండుట 6 కామమును వీడ కుండుట పైన చెప్పిన పదునెనిమిదితో బాటుయీ ఆరింటిని చేర్చినచో ఇరువది నాలుగు అగును ఇవియును మదదోషములే

శ్రేయాంస్తు షడ్విధస్త్యాగ స్తృతీయోదుష్కరో భవేత్
తేనదుఃఖం తరత్యేవ భిన్నం తస్మిన్ జితం కృతే॥ 27

షడ్విధత్యాగము శ్రేష్ఠమైనది వానిలో మూడవది దుష్కరము దానిచే మానవుడు దుఃఖమును మీరగలడు దానిచే ద్వైతభావము తొలిగిపోవును దానినాచరించినచో సర్వత్ర విజయము లభించును

శం భా త్యాగము ఆరువిధములు 1 ప్రియమును పొందిననుహర్షింపకుండుట 2 అప్రియమును పొందిన దుఃఖిం పకుండుట 3 వనితాదులనువీడి నిష్కాముడై యుండుట 4 ఈపైమూడు గుణము లు కలిగి యుండుట 5 అబద్ధము చెప్పు యాచకునకు, అర్హుడైన యాచకునకు యిచ్చి దుఃఖిం పకుండుట 6 కార్యము లు నెరవేరకున్నను దుఃఖింపకుండుట అయితే కామత్యాగము మాత్రము దుష్కరము

ఈషడ్విధ త్యాగములను మరికొందరు ఈవిధముగా వివరింతురు 1 ఐశ్వర్యము వచ్చినప్పుడు పొంగి పోకుండుట 2 వైరాగ్యము తో ఇష్టా పూర్తము ల నాచరించుట 3 కామ త్యాగము ఇదిమహాగుణము దీనినందరూ పొందజాలరు 4 మంచి కార్యము లుచేసి తుదకు దుఃఖిం చరాదు 5 సుఖ దుఃఖము లందు సమాన భావముండ వలెను

6 అర్థించిన వానికి పుత్రాదులనైనను దానము చేయుట

శ్రేయాంస్తు షడ్విధస్త్యాగః శ్రియంప్రాప్యనహృష్యతి।
ఇష్టాపూర్తే ద్వితీయం స్యాన్నిత్య వైరాగ్యయోగతః॥ 28

షడ్విధత్యాగము శ్రేష్టమైనది దానినాచరించిన వాడు సంపద నొందియు హర్షింపడు వానిలో ఇష్టాపూర్తము రెండవది నిత్యము వైరాగ్యము కల వాడై దానినాచరించుట ఉత్తమము 1 సంపద విద్యను పొందియు హర్షింపకుండుట 2 యాగాదులు తటాకారామాదుల నిర్మాణము ఈరెండునూ త్యాగములే,

కామత్యాగశ్చరాజేంద్ర సతృతీయ అతిస్మృతః
అప్యవాచ్యం వదన్త్యేతం సతృతీయో గుణస్మృతః॥ 29

రాజోత్తమా! కామత్యాగము మూడవది దానినాచరించుదాత చెంతకు యాచకుడు వచ్చి అవాచ్యము నడిగినను దాత దుఃఖింపరాదు. అపుడే అది సుగుణమగుచు

త్యక్తైర్ద్రవ్యై ర్యద్భవతినోపయుక్తైశ్చ కామతః
నద్రవ్యైస్తద్భవతి నోపయుక్తైశ్చ కామతః॥ 30

నచకర్మ స్వసిద్ధేషు దుఃఖంతేన చనగ్లపేత్
సర్వైరేవ గుణైర్యుక్తో ద్రవ్యవానపి యోభవేత్॥ 31

అప్రియేచ సముత్పన్నే వ్యథాంజాతు నగచ్ఛతి
ఇష్టాన్ పుత్రాంశ్చ దారాంశ్చన యాచేతకదాచన॥ 32

వనితాదులను ఫీడుటచేకలుగు నిష్కామత్వము, కామపూర్వముగా అనుభవించినను కలుగదు, "నజాతుకామః కామానము పభోగేన శామ్యతి" అను యయాతి అనుభవం తెలుపుచున్నది బహుళద్రవ్యములు లభించినను తృప్తి నొంది మానవుడు నిష్కాముడు కానేరడు కావున నిష్కాముడై తానాచరించు కర్మలు సఫలము కాకున్నను దుఃఖింపక

వాడే త్యాగి యగును సమృద్ధిగ సకల ద్రవ్యములు, కీర్త్యాదిసకల గుణములతో కూడిన వాడై విరవిగిని వాడే త్యాగియగును అట్టి త్యాగి తనక ప్రియము కలిగినను ఎప్పుడు గాని వ్యథనొందడు పైవిధమున మెలగుట నాల్గవత్యాగము అగును. తన ఇష్టులను, పుత్రులను, భార్యను చూచియు ఏమియును ఎప్పుడును యాచింపకుండుట ఐదవ త్యాగము యోగ్యుడైన యాచకునకు అపిగినది ఒసగుట శుభకరము అది ఆరవత్యాగము పరికింపగా అయాచితులకు సైతము వారి కిష్టమైన వస్తువుల నొసగుట సుగుణము కావలసినన్ని వస్తువులున్ననూ అనుభవింపకుండుట ఉపభోగత్యాగము వనితాదులు వచ్చితనపైబడినను, చలింపకుండుట మహాత్యాగము ఈవిధముగ రాగ ధనత్యాగము లాచరించుట ఉత్తమ పద్ధతి. 'మిథిలాయాం ప్రదగ్ధాయాం నమే కించి నదహ్యతి'-అనెడి జనకమహారాజు వలె సంపన్నుడై యుండియు నిష్కామముగా నున్నవాడే మహాత్యాగి

అర్హతేయాచమానాయ ప్రదేయం తచ్ఛుభం భవేత్।
అ ప్రమాదీ భవేదేతైఃనచాప్యష్ట గుణోభవేత్॥ 33

అర్హుడైన యాచకున కొసగునదియే శుభదాయకమగును, పై త్యాగముచే ప్రమాదరహితుడును, అష్టగుణుడును అగును

శంకా - అ ప్రమాదము = "అపథ్యానమలో ధర్మే, మలోఽర్థస్య నిగూహనం। అప్రమాదమలః కామో భూయస్సగుణ వర్ధనః॥" (రాజ ధర్మముల సూక్తి) మోక్ష ధర్మమును కానరానీయక కప్పి పుచ్చునదే మలము అది రెండు విధములు 1. అపథ్యానము = ఇదిధర్మమునకు చెందినమలము 2 అప్రమాదము = ఇది కామము నకు చెందినమలము త్యాగబుద్ధితో ప్రమాదములు తొలగును అటుపిమ్మట కామము నశించును, అపుడు అ ప్రమాదిమోక్షమును పొందును

సత్యం ధ్యానం సమాధానం చోద్యం వైరాగ్యమేవచ।
అస్తేయం బ్రహ్మ చర్యంచ తథా సంగ్రహమేవచ॥ 34

ఏవం దోషా మదస్యోక్తాస్తాన్ దోషాన్ పరివర్జయేత్।
తథాత్యాగోఽప్రమాదశ్చ సచాప్యష్టగుణోమతః 35

క్రోధాదులు పన్నెండు వికత్థనాదులు ఆరున్నుకలిసి పదునెనిమిది దమ దోషములుగా పూర్వం చెప్పబడినవి అవియే మదదోషములు ఆదోషములను విసర్జించవలెను వాటిని వీడినచో అప్రమాదియగును అట్టిప్రమాద హీనుడే అష్టగునుడు ఆ గుణములు 1 సత్యము 2 ధ్యానము 3 సమాధానము 4 చోద్యము 5 వైరాగ్యము 6 అస్తేయము 7 బ్రహ్మచర్యము 8 అసంగ్రహము 1 సత్యము = యదార్ధభాషణము 2 ధ్యానము = భగవంతునియెడల ఎడతెగని మనఃప్రవత్తి 3 సమాధానము = పరమాత్మతోడి ఐక్యస్థితి, సంప్రజ్ఞాత అసంప్రజ్ఞాత సమాధిస్థితి 4 చోద్యము = "కోహం కస్యకుతోహం" అనుతత్త్వవిచారణచేయుట 5 వైరాగ్యము = శబ్దాది విషయములందు విరక్తి 6 అస్తేయము = దొంగబుద్ధి లేకు డుట 7 బ్రహ్మచర్యము = అష్టవిధమైథునలక్షణములు = స్మరణం కీర్తనం, కేళి, వీక్షణం గుహ్యభాషణం, సంకల్పం మొ॥వి లేకుండుట 8 అసంగ్రహము = వేటినీ తీసుకొనకుండుట

అష్టాదోషాః ప్రమాదస్యతాన్ దోషాన్ పరివర్జయేత్ ఇంద్రియేభ్యశ్చ
పంచభ్యోమనసశ్చైవ భారత అతీతా నాగతేభ్యశ్చ ముక్త్యుపేత
స్సుఖీభవేత్॥ 36

ప్రమాదనమునకుగల ఎనిమిది దోషములను విడువవలెను జ్ఞాన, కర్మేంద్రియముల కోరికలను విడువవలెను అరవ ఇంద్రియమగు మనస్సును అరికట్టవలెను గడిచి పోయిన కష్టాలను స్మరింపరాదు రాబోయే సుఖాలను గూర్చిన యోచనను మానవలెను అట్లు మెలగిన వాడే సుఖియై ముక్తుడగును (అతీతము = గడిచిన విషయములను స్మరించుటచే కలిగేదుఃఖము అనాగతము = రాబోవు కష్టములను చూచుట తోను, మనోబాహ్యముల పరిహరించుటచే కలుగు దుఃఖము)

సత్యాత్మభవరాజేంద్ర సత్యేలోకాః ప్రతిష్ఠితాః
తాంస్తు సత్యముఖానాహుః సత్యేహ్యమృత మాహితమ్॥ 37

రాజేంద్రా! స్వస్వరూపుడవై సత్యము నందే చిత్తముగలవాడవై, మెల గుము సత్యము నందే సత్యము నందే లోకములన్నియు ప్రతిష్ఠితములై యున్నవి ఆత్మ లాభములన్నియును సత్యాధీనములేనని తెలిసి కొనుము. దమము త్యాగము అప్రమాదము-అను నీమూడున్ను సత్యాధీనములు. సత్య ప్రధానములని పెద్దలు చెప్పిరి సత్యము నందే అమృతము = మోక్షము ప్రతిష్ఠింప బడియున్నది ప్రతి మానవుడు సత్యమార్గమున ప్రవర్తిల్లుట ముఖ్యము,

నివృత్తేనైవదోషేణ తపోవ్రత మిహాచరేత్
ఏతద్ధాత్ర కృతం వృత్తం సత్యమేవ సతాంవ్రతమ్॥ 38

క్రోధాది దోషములను పూర్తిగా విడనాడి, తపోవ్రతము ఈ లోకముననే ఆచరింపవలెను, అపుడే తపస్సు సిద్ధించును బ్రహ్మచే ఈ నిర్ణయము కావింపబడెను, కావున సత్యవ్రతమును సజ్జను లాచరింపవలెను,

దోషైరేతై ర్విముక్తస్తు గుణైరేతై స్సమన్వితః
ఏతత్సమృద్ధమత్యర్థం తపోభవతి కేవలమ్॥ 39

యన్మాం పృచ్ఛసిరాజేంద్ర సంక్షేపాత్ప్రబ్రవీమితే
ఏతత్పాపహరం పుణ్యం జన్మమృత్యుజరాపహమ్॥ 40

పైన పేర్కొనిన సమృద్ధము, ఋద్ధము అను వానిని చెప్పితిని, క్రోధాది దోషములు లేనివాడై, జ్ఞానాది ధర్మగుణములు కలవాడై చేయుతపమే ముఖ్యమైనది సమృద్ధమైనది. అదియే అర్థమును అనగా లౌకిక ప్రయో జనములను అతిక్రమించిన దై యుండును రాజేంద్రా! నీవడిగిన నిష్క ల్మష తపస్సును గూర్చి సంక్షేపముగా చెప్పితిని నేను చెప్పిన తపోవ్ర తము పాపహరము-పుణ్యమని ఎఱుగుము, వారు జన్మమృత్యుజరల ను దాటగలరు

ధృతరాష్ట్ర ఉవాచ –

ఆఖ్యాన పంచమైర్వేదైః॥ భూయిష్టం కథ్యతేజనః
తథాచాన్యే చతుర్వేదా స్త్రివేదాశ్చ తథాపరేః॥ 41

ద్వివేదాశ్చైక వేదాశ్చా ప్యనృశచశ్చ తథాపరే
తేషాంతు కతరః నస్స్యాద్యమహం వేదవై ద్విజః॥ 42

శం భా – మునీంద్రా! "ఇతిహాస పురాణం పంచమం' అని ఛాందోగ్య మంత్రము చెప్పుచున్నది కావున పంచమ వేదము ను పఠించినవాడే ద్విజుడని కొందరు చెప్పుదురు, చతుర్వేదముల పఠించినవాడు శ్రేష్టుడని కొందరు ఋగ్యజుస్సామముల పఠించిన వాడుత్తముడని మరికొందరు ఋగ్యజుర్వేదాధ్యాయి గొప్పవాడని కొందరు ముఖ్యమైన ఋగ్వేదము ను మాత్రము పఠించినవాడు ఉత్తమోత్తముడనియు ఇవన్నియుగాక ఆఖ్యానములు మాత్రము చదివిన చాలునను వారూవున్నారు వీరిలో మీరు చెప్పిన బ్రాహ్మణుడెవరు? అధికుడెవరు? మీరు చెప్పినచో తెలిసి కొందును

నీలకంఠ భా – అంతేకాదు బ్రహ్మము నెరిగిన వాడు కదా బ్రాహ్మ ణుడు, "సర్వం ఖల్విదంబ్రహ్మ" బ్రహ్మైవేదవిశ్వం, పురుషఏవేదగ్ం సర్వం"– ఈ సమస్తము బ్రహ్మస్వరూపు డైన పురుషుడే అనిమంత్ర ములు చెప్పుచున్నవి, ఐదు వేదములు ఆపరమాత్మయే స్థావరజంగమా త్మక ప్రపంచ మని చెప్పుచున్నవి. వేదమనగా బ్రహ్మము వేదములు కూడా బ్రహ్మము నే ప్రతిపాదించుచున్నవి నాల్గు వేదము లు నాల్గుపురుషులను పేర్కొను చున్నవి 1 శరీర పురుషుడు 2, ఛందఃపురుషుడు 3 వేదపురుషుడు 4 మహాపురుషుడని పేర్కొ ను చున్నారు గాయత్రిమున్నగు ఛంధస్సులు ఋగ్యజు స్సామము ల కు చిహ్నము లు అవి కర్మబోదనాత్మకుడైన బ్రాహ్మణుని గూర్చి చెప్పుచున్నవి. 1 క్షరుడు 2 అక్షరుడు 3 ఉత్తముడను ముప్వురు పురుషుల గూర్చితెలుపుచున్నవి క్షర, ప్రధాన అమృత, అక్షర, హర,

పర అనునామములు ఒకే దేవునికి చెందినవి. అమృతుడు, జీవుడు కూటస్థుడు అనునామములు (రెండవ) స్థూలపురుషునికి చెందినవి క్షరాక్షరాదులకంటె భిన్నుడు ఉత్తమ పురుషుడు "ద్వే బ్రహ్మణి వేది. తద్వే శబ్దబ్రహ్మ పరంచయత్" అనెడి సూక్తి ప్రకారము శబ్దబ్రహ్మము పరబ్రహ్మము అని బ్రహ్మపదార్థము రెండువిధములుగా యున్నట్లు తెలియుచున్నది నామరూపాత్మకమగు శబ్ద బ్రహ్మముగానూ, "తత్, అతీతం" అనునామము గలది పరబ్రహ్మముగానూ కొందరు చెప్పుచున్నారు "ఏకధై వాను ద్రష్టవ్యం నేహనానాస్తి కించన' అనుమంత్రముచే బ్రహ్మ పదార్థ మొక్కటే యునియు నానాత్వము, భిన్నత్వము లేదనియు ఏక వేదము = ఒకటే బ్రహ్మవస్తువని కొందరు చెప్పుచున్నారు ఋుచ్యతే = స్తూయతే అనుధాతువునుండి పుట్టిన 'ఋుక్' శబ్దముచే స్తుతింపబడు ఈశ్వరు డొక్కడేయనియు కావున అతని విషయమున భిన్నత్వము, అనేకత్వము లేదనియు, కావున "అనృచః" అని బ్రహ్మద్వైతవాదులు చెప్పుచున్నారు ఏకవేదులకు అనృచులకుగల భేదమేమనగా-ఏకవేదుల మతమున వ్యుత్థానకాలమున(జాగ్రదవస్థలో) బ్రహ్మపదార్థము పట్ల ద్వైతభావముకలదు సమాధ్యవస్థలో అట్టిద్వైత భావముండదు అనృచుల మతమున అవస్థాత్రయమందును (జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలలోకూడ) ద్వైతభావము లేదు అయ్యా! నేనెరిగిన ద్విజుడుపైఆరు పక్షములలోదేనికిచెందినవాడు? దానిని నాకు చెప్పుము

వివరణ –

1 భూమాఖ్యమైన పరబ్రహ్మమే స్థావరజంగమాత్మక జగత్తయినచో అది "సవిశేషము" కావున ద్వైత పక్షమగు చున్నది 2 పురుష చతుష్టయమును గూర్చి చెప్పెడి రెండవ వాదము సాంఖ్యులకు, మీమాంసకులకు చెందిన నిరీశ్వరవాదము 3 త్రివేదులు-వారు పాతంజలులు = వారు జీవునకు, ఈశ్వరునకు, జగత్తుకు భేదముకలదని చెప్పుచున్నారు 4 ద్వివేదులు-ఔడలోములమతము నకు చెందినవారు

అనగా కార్యాత్మ చేకలుగు భేదభావము కారణాత్మ చేకలుగు అభేద భావము రెండును శక్యములే అని వాదించెదరు. ఎట్లనగా, ఒకే బంగారము కటకమకుటాదుల రూపమున ఏర్పడు భేద భావమును, బంగారు రూపమున ఏర్పడు అభేద భావమును ఈ రెండునూ సత్యములే కదా! కటకాదులు కార్యము, కనకము కారణము ఈ రెండు నూ సత్యములేనని "ఔడలోము లు" వాదించుచున్నారు 5 ఏకవేదులు = సత్యాసత్యములచే అనిర్వచనీయమైయున్నది వ్యావహారికమునైయున్నది అది ప్రాతి భాసికమైయున్నది త్రాడు పాముకంటె విలక్షణమైనది మోక్షప్రాప్తి వరకు అబాధ్యము మోక్షప్రాప్తి సమయమున జ్ఞానోదయముచే ద్వైతభావము నశించును. కావున కించిద్బాధకులోనగుచున్నవి చీకటిలోనున్న రజ్జువునుచూచి సర్పమని భావింతురు దీపకాంతిచే యదార్థమెరిగిన పిమ్మట అభ్రాంతి పోవును రజ్జువు సత్యము అటులే పరబ్రహ్మము సత్యము, రజ్జువు నందలి సర్పభావమువలె బ్రహ్మవిషయిక మైన ద్వైతభావము అ సత్యము అది వ్యావహారికమే కానీ సత్యము కాదు అన్నచులు అరవ పక్షమునకు చెందినవారు వీరు దృష్టి సృష్టివాదులు చీకటిలో రజ్జువునుచూచి, భ్రాంతిచే సర్పమును కల్పించి చెప్పినట్లు, ఆత్మయందు జాగ్రత్స్వప్నములను సమానముగా కలవని కల్పించి చెప్పుచున్నారు ఇదియే ఏకవాదుల పక్షమునకు, అన్నచువాదుల పక్షమునకు గలభేదము

పై ఆరు పక్షములలో మొదటి నాలుగున్ను వ్యవహార సిద్ధములు అవి "తత్రాధ్యారోపా పవాదాభ్యాం నిష్ప్రపంచః ప్రపంచ్యతే అను న్యాయమః ననుసరించి అధ్యారోప దృష్టితో పారమార్థిక త్పరములుగ ఉపన్యసింపబడినవి

అధ్యారోపమనగా ఒక వస్తువునందు అవస్తువు కాని దానిని ఆరోపించుట రజ్జువు నందు సర్పమును భావించుట నిష్ప్రపంచమైన

బ్రహ్మము నందు ప్రపంచము, శరీరపురుషాదులు క్షీరాదులు శబ్ద బ్రహ్మము ఆరోపింపబడుచున్నవి చిట్ట చివరిదగు అన్నిపక్షమున బ్రహ్మమందు జాగ్రిదాదులు అధ్యారోపన్యాయ మందలి అపవాద దృష్టిచే వ్యవహారకలాపము చే బ్రహ్మ తిరిక్తము లు కల్పింపబడినవి

అపవాదమనగా, బ్రహ్మమందు తదతిరేకముగా ప్రతీతమైన ప్రపంచము యొక్క అభావము ను నిశ్చయించి చెప్పుట
1) శ్రౌతము 2) యౌగికము 3) ప్రత్యక్షము అని మూడు విధ ములుగా కలదు 1) శ్రౌతము - "నేహనానాస్తి కించన" మున్నగు శ్రుతులచే బ్రహ్మతిరిక్త అభావమును నిశ్చయించి చెప్పుట శ్రౌతాప వాదము 2) యౌగికము - కనకము కంటె అతి రేకముగా కనకాది అభావమును నిశ్చయించినట్లు ప్రపంచము బ్రహ్మమాత్రాత్మకమేగాని బ్రహ్మతి రేకము కాదని చెప్పుట 3) ప్రత్యక్షము = దీపకాంతి చే ప్రత్యక్షముగాచూపి ఇది రజ్జువేకాని సర్పము కాదని చెప్పినట్లు 'తత్త్వ మసి" అని చెప్పుట ప్రత్యక్ష అపవాదము మోక్షేచ్ఛగల పురుషునికి చక్కగా బోధించుటకై బ్రహ్మ వస్తువును విపరించుటకై, ఆరోపదృష్టి అపవాదదృష్టి, వ్యామిశ్రదృష్టి, అను విభాగములను పెద్దలు కావించిరి పైమూడు దృష్టులను విడిచి, మూడువేదములందలి బ్రహ్మవస్తువును బోధింపజాలడు

కావున పై ఆరు పక్షములలో ఏ పక్షమునకు చెందిన ద్విజుడు ఉత్తముడు? జాతిచేత బ్రాహ్మణుడగు చున్నాడా? వేదముల చదివి ఉత్తమ బ్రాహ్మణుడగుచున్నాడా? అని ధృతరాష్ట్రుడు ప్రశ్నించాడు

సనత్సుజాత ఉవాచ –

ఏకస్య వేదస్యాజ్ఞానాద్వేదాస్తేబహవః కృతాః
సత్యస్యైకస్య రాజేంద్ర సత్యేక శ్చిదవస్థితః॥ 43

ఏకమైన బ్రహ్మపదార్థము యొక్క జ్ఞానములేని కారణమున దానిని తెలియజేయుటకై పెక్కు వేదములు బయల్వెడలినవి ఏకమైన బ్రహ్మ వస్తువే సత్యమైనది అది తెలిసిన వాడెవడో ఒకడు మాత్రమే సత్యమైన పరబ్రహ్మమందు లగ్నమైయుండును

ఏవం వేదమ విజ్ఞాయ ప్రాజ్ఞోఽహమితి మన్యతే।
దానమధ్యయనం యజ్ఞోలో భాదేత త్ప్రవర్తతే॥ 44

ఈ విధముగా వేదమును, బ్రహ్మమునెరుగక, అహంకారముచే నేనేప్రాజ్ఞుడనని మానవుడు తలచుచున్నాడు అంతేకాదు, ఫలాశతో దానమును వేదాధ్యయనమును యజ్ఞమును చేయుచున్నాడు

సత్యాత్ ప్రచ్యవమానానాం। సంకల్పశ్చతథాభవేత్।
తతోయజ్ఞః ప్రతాయేత। సత్యస్యైవావ ధారణాత్॥ 45

సత్యమైన పరమార్థ జ్ఞానము నుండి జారిన వాని సంకల్పము వ్యర్థమే అగును అందుచేవాడు స్వర్గాదిఫలలాభముతో యజ్ఞము చేయును సత్యమును, యజ్ఞమును గుర్తించిన వాడు సత్య ప్రీతికే యజ్ఞము చేయును

విశేష — సత్యము పరమానంద స్వరూపము, అట్టి సత్యము నుండి జారినవాడు క్షుద్రుడు వాని ఆనందము క్షుద్రానందము వాని సంకల్పము (కోరిక) కూడా క్షుద్రమే సత్య మెరిగిన వారి సంకల్పము సత్యసంకల్పమే యగును అట్టి సంకల్పముతో సత్య ప్రీతిగాచేయువాని యజ్ఞములు సఫలములగును లేనిచో సంసార బంధహేతువులగును

మనసాన్యస్యభవతి వాచాన్యస్యాథ కర్మణా
సంకల్పసిద్ధః పురుషస్సంకల్పానధి తిష్ఠతి॥ 46

మనసా దేవతలను ధ్యానించుటయే మానసిక యజ్ఞము వాక్కులతో దేవతలను స్తుతించుట జపించుట-జపయజ్ఞము యజ్ఞయాగాదుల నాచరించుట కర్మయజ్ఞము సత్య సంకల్పుడే సంకల్ప సిద్ధుడైన

పురుషుడు అట్టివాడే సంకల్పము లగు బ్రహ్మలోకాదులన ధిష్ఠించగల బ్రహ్మవేత్తయగును వాడే భ్రాంతి విహీనుడై బ్రహ్మ స్వరూపుడగును

"ఆప్నోతి స్వారాజ్యం అప్నోతి మనసస్పతి, వాక్పతిశ్చక్షుష్పతిః
శ్రోత్రపతి ర్విజ్ఞాన పతిః॥- శ్రుతి

స్వరాట్టు = పరబ్రహ్మము,

స్వారాజ్యము = బ్రహ్మైశ్వర్యము బ్రహ్మవస్తువును మనస్సున ధ్యానించి పొందిన వాడే మనస్పతి వేదపఠనము ను, జపమును బ్రహ్మప్రీతిగా చేయువాడే వాక్పతి కనులు మూసుకొని ఆజ్ఞాచక్రమున బ్రహ్మమును చూచువాడే చక్షుష్పతి చెవులతో బ్రహ్మ విషయమును వినువాడేశ్రోత్ర పతి పైరీతిని విజ్ఞాన స్వరూపముగా బ్రహ్మము నెరిగిన వాడె విజ్ఞానపతి యగును వాక్పతి అనాహత చక్రమున మనస్పతి మణిపూరక చక్రమున చక్షుష్పతి అజ్ఞానచక్రమున, విజ్ఞానపతి సహస్రార చక్రమున శ్రోత్ర పతి ప్రణవ స్వరూపనాద బ్రహ్మమునకు ఆధారములైన మూలాధార, స్వాధిష్ఠానములందు ప్రాణాయామమున కూడగలరు

అనైశ్వర్యేన చైతస్య దీక్షిత వ్రతమాచరేత్
నాహ్మైతద్ధాతు నిర్వృత్తం సత్యమేవ సతాంపరమ్॥ 47

పై శ్లోకమున చెప్పిన సంకల్పముమనశ్చాంచల్యముచే ధృఢమైనదికాదు సంకల్పము ధృఢమగుటకు దీక్షితవ్రతము నవలంబింపవలెను 'దీక్ష" అనుధాతువు నుండి దీక్షితుడు అనెడి పదము కలిగినది దీక్షితుడున్నగుము సజ్జనులకు సత్యమయిన బ్రహ్మమే ధ్యానార్హమగుట చేత శ్రేష్ఠమయినదని ఎరుగుము

విశేష - మనస్సు చంచలమయినది అది నిశ్చలము కానిచో బ్రహ్మ సాక్షాత్కారము కాదు తన అజ్ఞానమువలన ఆత్మయన నేమోతెలియదు తన సంకల్పము ధృఢముకానందున వ్యర్థమగును అందుచే దీక్షిత వ్రతమును ఆచరింప వలెను "దీక్ష వ్రతాదేశే" అనుధాతువు నుండి దీక్షితపదమేర్పడినది

జ్ఞానంవై నామప్రత్యక్షం పరోక్షం జాయతే తపః
విద్యాద్వ్రహుం పఠంతంతు ద్విజం వై బహుపారితమ్‌॥ 48

జ్ఞానఫలములు ప్రత్యక్షములు కానీ తపోఫలములు పరోక్షములు, జ్ఞానము లేక, తప్పను లేక, ఎక్కువగా చదువు కొన్నంత మాత్రన వానిని మంచి చదువరిగానే భావించవలెను

నీలకంఠ భా - సత్యము జ్ఞానము, ఆనందము, బ్రహ్మము అను పదములు సమానార్థకములు కావున జ్ఞానమనగా పరబ్రహ్మము అది శోక మోహము లను తొలగించును అదియే జ్ఞానమునకు ప్రత్యక్షఫలము "తపః" అనుపదము సర్వకర్మలకు ఉపలక్షణము మనోవాక్కాయము లచే చేయు కర్మలను సత్యప్రీతిగా చేసినచో పరోక్షఫలమగు ఆముష్మిక ము (స్వర్గసుఖమును) మాత్రమే ఇచ్చి సంసారమున పడద్రోయును, కావున బ్రహ్మార్పణ బుద్ధితో చేయవలెను, బహువేదములను పఠించి శిష్యులచే పఠింప చేసిననూ, ఆబ్రాహ్మణుడు బ్రహ్మజ్ఞాన మాచరించిన నాడే నిజమైన బ్రాహ్మణుడగును

తస్మాత్ క్షత్రియమామంస్థా జల్పితేనైవ వై ద్విజం
యఏవ సత్యాన్నాపైతి, సజ్ఞేయో బ్రాహ్మణస్త్వయా॥ 49

క్షత్రియుడా! వేదాధ్యయనము నే జల్పితముగా నెరుగుము. కేవలవేదా ధ్యయనము చేయు విప్రుని ద్విజునిగా భావింపకుము. సత్యమైన పర బ్రహ్మము నుండి ఎవని మనస్సు జారదో, వానినే బ్రాహ్మణునిగా భావిం పుము జల్పితము = అధ్యయనము

విశే అ॥ - ప్రత్యగ ద్వయానంద స్వరూపుడైనే బ్రహ్మమునకు దగ్గర గా నుండువాడే అపరోక్ష జ్ఞానియైన బ్రాహ్మణుడని, "యోవా ఏత దక్షరం గార్గి విదిత్వాఽస్మాల్లోకాత్ప్రైతిసబ్రాహ్మణః"-అని శ్రుతి తెలు పుచున్నది అందుచే సత్యమందే నిశ్చల మనస్సుతో నుండుట అనెడి మౌన సిక యజ్ఞము నాచరించుట మంచిదని తెలిసికొనుము

ఛందాంసినామ క్షత్రియ తాన్యథర్వా పురాజగౌ మహర్షిసంఘ ఏషః
ఛందోవిదస్తేయఉత నాధీతవేదానవేద వేద్యస్యవిదుర్హితత్త్వమ్॥ 50

ఛందస్సులనగా వేదములు క్షత్రియా! వానిని తొలుత అథర్వమహాముని పఠించెను, పిమ్మట వానిని ఈమహర్షిసంఘము పఠించెను. కేవల వేదములను వేదార్థములను తెలిసికొనినంతమాత్రాన, వేదవేత్తలు కారు వేదవేద్యమైన తత్త్వమును అనగా పరబ్రహ్మమును ఎరిగినవారే వేదవేత్తలగుదురు

ఛందాంసి నామ ద్విపదాం వరిష్ఠ స్వచ్ఛంద యోగేన భవంతి తత్ర
ఛందోవిదస్తే నచతానధీత్య గతానవేదస్య నవేద్యమార్యాః॥ 51

మానవోత్తమా! వేదములు స్వేచ్ఛగా పరమాత్మను గూర్చి తెలుపుట యందే ప్రమాణములుగా నున్నవి కావున పండితులు బ్రహ్మప్రీతిగా వేదములను పఠించి వేద్యవేద్యమయిన బ్రహవస్తువునే పొందెదరు అందుచే జ్ఞానులైన అర్యులు వేద్యమయిన ప్రపంచమును పొందరు

శం భా - సకల వేదములును బ్రహ్మ పదార్థమునే బోధించుచున్నవి సకలవేదములచే "అహం" పదార్థమయిన బ్రహ్మవస్తువునే తెలిసికొనదగినదనియు తెలియుచున్నది వేదములు పరమ పురుషార్థమయిన బ్రహ్మమును ప్రతిపాదించుటచే, బ్రహ్మేతరమయినదంతయు అనిత్యము, అశుచి దుఃఖభూయిష్టమయి యున్నదని తెలియుచున్నది. అందుచే వేదముల వలన బ్రహ్మస్వరూపమును, బ్రహ్మజ్ఞానమును బ్రహ్మప్రాప్తి సాధనములను తెలుసుకొనవచ్చును కావున పండితులు వేదాధ్యయన మొనర్చి, వేదాంతశ్రవణాదుల నాచరించి వేదము యొక్క అనగా జ్ఞానరూపుడైన పరమాత్మయొక్క స్వరూపము ను పొందుచున్నరు వేద్యమయిన ప్రపంచమును బ్రహ్మవిదులు పొందరు.

నవేదానాం వేదితా కశ్చిదస్తి కశ్చిత్త్వేతాన్ బుధ్యతేవాపి రాజన్
యోవేదవెదాన్ నసవేద వేద్యం సత్యేస్థితో యస్తు సవేద వేద్యమ్॥ 52

వేదరహస్యము లెరిగిన వాడెవ్వడూలేడు రాజా చిత్తశుద్ధి కలవాడెవడో అతడు మాత్రమే బ్రహ్మమును తెలుపు వేదములను తెలుసుకొను చున్నాడు వేదవిదుడైనను సంశయాత్ముడైనచో వేదవేద్యమయిన బ్రహ్మము నెరుగలేరు. సత్యమయిన అక్షర పరబ్రహ్మమందు చిత్తము ను నిలిపినవాడు మాత్రమే బ్రహ్మమును తెలుసుకొనగలడు

నీలకంఠ భా ,- రాజా! పరబ్రహ్మ స్వరూపమును తెలుసుకొనుట సాధ్యముకాదు వేదరహస్యముల నెరిగిన వాడునులేడు అతిశయమ యిన బుద్ధిగలవాడెవ్వడో ఒకడు మాత్రమే బ్రహ్మరహస్యప్రతి పాద కములైన వేదములను తెలుసుకోగలడు

"తత్త్వమసి" అను వాక్యార్థము ను అనుసంధించువాడు వేదముల నెరిగినను, అతడు పెక్కువికల్పములతో (సందేహములతో) కూడిన కారణమున, నిర్వికల్పమైన (వేద్యమును) బ్రహ్మము నెరుగ లేడు సకలేంద్రియ వ్యాపారముల జయించినపుడే బ్రహ్మము గోచరిం చును ప్రత్యక్చైతన్యము సత్యపదార్థము అది అక్షరము, క్షరమైన ప్రకృతియంతయు అధిభూతము, అధిభూతమున నున్నను సకలేంద్రి యవృత్తులను నశింపచేసుకొని సత్యమునందున్నవాడే నిర్వికల్పసుఖము నెరుగగలడు వానికే వేద్యమైన బ్రహ్మము గోచరించును

నవేదానాంవేదితాకశ్చిదస్తి। వేద్యేనవేదంనవిదుర్నవేద్యం।
యోవేదవేదం సచవేదవేద్యం। యోవేదవేద్యం ననవేదసత్యమ్॥ 53

వేదములు జడములు వేద్యమైన బ్రహ్మపదార్థము జ్ఞాన స్వరూపము. కావున ఋగాది వేదములలో ఏ ఒక్కటియును పరమాత్మను తెలుసు కొనలేవు. వేదపారకుడు కూడ జడుడు కాన పరమాత్మను తెలుసుకొన లేడు "వేద్యపదమునకు, బ్రహ్మపదార్థము. జడమైన ప్రపంచము అని రెండు అర్థములు కలవు. వేద్యము అనగా కేవలం జడప్రపంచము దానిని తెలుసుకొన్నవాడు వేదమైన పరమాత్మను తెలుసుకోలేడు, అంతే కాదు, వేద్యమైన ప్రపంచ విషయమును కూడ సరిగా తెలుసుకోలేడు

వేదమును అనగా పరమాత్మ నెరిగిన జ్ఞానిమాత్రమే సత్యమయిన పర మాత్మను వేద్యమైన ప్రపంచము ను,రెండింటినీ తెలునుకోగలడు

నీలకంఠ భా – అంతేకాదు వేద్యములయిన అహంకారాదులు అచేత నములు, వానిలో ఏ ఓక్కటి కూడ వేదవేద్యమైన బ్రహ్మమును తెలును కోలేవు వేదవేద్యమైన చేతన్సుచే (మనస్సుచే) వేదభోద్యమైన ఆత్మ నెవడును తెలుసుకోలేడు మనను జడము, అట్టి జడమునకు ఆత్మగాని అనాత్మఅయిన ప్రపంచముగాని గోచరములు కావు అందుచే వేద్యమైన చేతన్సుచే అనాత్మకూడ తెలియబడదు ఆత్మను తెలిసికొనిన జ్ఞాని మాత్రమే అనాత్మఅయిన ప్రపంచమును తెలుసుకోగలడు

> యో వేదవేదాన్ నచవేదవేద్యం। నతం విదుర్వేద విదోనవేదాః
> తథాపివేదేన వదన్తి వేదం। యే్బ్రహ్మణా వేదవిదో భవన్తి॥ 54

కేవలము ఋగాది వేదములను పఠించువాడు మాత్రము వేదవేద్యము యిన పర్బ్రహ్మమును తెలిసికొనజాలడు జడములైన వేదములు కేవల వేదపాఠకులునుమాత్రము "తత్" పదార్ధమయిన పరమాత్మను తెలుసుకొ నజాలరు తెలియజేయలేరుకూడ బ్రహ్మజ్ఞాన సంపన్నులైన వేదవేత్తలు మాత్రము పరమాత్మను తాముతెలుసుకొని,ఇతరులకూతెలియజేయగలరు నీలకంఠ భా – చిదాత్మ అందరకు ప్రత్యక్స్వరూపుడుగా యున్నా డు అట్టిప్రత్యక్స్వరూపుడైన పరమాత్మను తెలియజేయుట చేతనే వాటికి వేదములను పేరుగలిగినది, వెదపఠనము, వేదార్థ గ్రహణము వేదోక్తకర్మను ష్టానము అనుమూడింటిని ఆచరించిన వారే వేద విదు లగుదురు వారు అధ్యయన యజ్ఞాదులచే సంస్కృత చిత్తులగుదురు పైరీతినివే దముల నెరిగిన వారే వేద ప్రమాణముల నెరిగినవారై, ప్రమాత లనబడుదురు వారికే వేద్యమయిన అనగా ప్రమేయమయిన పరమాత్మ తెలియును

> "ప్రాణస్య ప్రాణం చక్షుషశ్చక్షుషం, శ్రోత్రస్య శ్రోత్రం
> మనసోయే మనోవిదుః॥" – (శ్రుతి)

దీని ప్రకారము ప్రాణములను, నేత్రములను, చెవులను మనస్సును

అయా పనులపై ప్రవర్తింపచేయువాడు పరమాత్మయే అను విషయము నెరుగుటకు వేదములే ప్రమాణములు కేవలపాఠకులు ఆ పరబ్రహ్మ శక్తిని తెలుసుకొనలేదు, "అహం బ్రహ్మాస్మి" అను జ్ఞానముగల వేద విదులు, వేద ప్రమాణముచే వేద్యమయిన పరమాత్మను తెలసికొను చున్నారు వారే బ్రాహ్మణులగుచున్నారు

థామాంశభాగస్య (యమాంశ భాగస్య) తథాహివేదాః ।
యథా చ శాఖాహి మహీరుహస్య ।
సంవేదనేచైవ యథామనన్తి ।
తస్మిన్హిసత్యే (నిత్యే) పరమార్థనోఽర్థే ॥ 55

చెట్టును గుర్తించుటకు దాని శాఖలు హేతువులగునట్లే, యామాంశ భాగమయిన పాడ్యమి చంద్రుని గుర్తించుటకు వేదమే హేతువగు చున్నది అట్లే సత్యమైన పరమాత్మ జ్ఞానమును తెలియజేయుటకు వేద ములే హేతువులగుచున్నవి

అభిజానామి బ్రాహ్మణం వ్యాఖ్యాతారం విచక్షణమ్
యచ్ఛిన్నవిచికిత్సస్సవ్యాచష్టే సర్వసంశయాన్ ॥ 56

బ్రహ్మ యనగా వేదము అందలి పరమాత్మ స్వరూపమును చక్కగా వివరించి చెప్పగలవాడే బ్రాహ్మణుడు అతడే పరబ్రహ్మ నిరూపణలో గలుగు సందేహములను, సామాన్య సంశయములను తొలగించి చెప్ప గలడు అట్టి వానినే బ్రాహ్మణునిగా నేను గుర్తించుచున్నాను

నాస్యపర్యేషణం గచ్ఛేత్ ప్రాచీనం నో తదక్షిణమ్
నార్వాచీనం కుతస్తిర్యఙ్నాదిశం న కథంచన ॥ 57

తూర్పు, దక్షిణము మున్నగు దిక్కులందును, ఆగ్నేయము మున్నగు అవాంతర దిక్కులందును, పరమాత్మను వెదకుట వ్యర్థము. పరమాత్మ అంతటను గలడు, అట్టి పరమాత్మను నిరూపించుటకు జ్ఞానియైన బ్రాహ్మణుడొక్కడే సమర్థుడు.

తస్యపర్యేషణం గచ్ఛేత్ ప్రత్యర్థిషు కథంచన
అవిచన్వన్నిమంవేదే, తపః పశ్యతితం ప్రభుమ్ ॥ 58

దేహేంద్రియాదులు శబ్దస్పర్శాదులు పరమాత్మకు ప్రత్యర్థులు వానిలో పరమాత్మ లేదు అందుచే వానినే పరమాత్మగా భావింపరాదు జ్ఞానులు పరమాత్మను గూర్చి వేదములందే వెదికెదరు కొందరు వేదముల ద్వారా పరమాత్మను తెలుసుకోలేక తపోమార్గమున పరమాత్మను దర్శించెదరు. ఏమ్మట సమస్తమునకును పరమాత్మయే ప్రభువనీ జ్ఞానులును, తాపసులును నిర్ణయించిరి

శం భా. – "విషయాశ్చేంద్రియాణ్యేవ దేహోఽహంకార ఏవచ।
బాహ్యశ్చాన్తరాఘోరాశ్శత్రవో యోగిన స్మృతాః ॥

ఆత్మాను సంధానముగావించు యోగికి ఆటంకము కలిగించు శత్రువు లెందరో కలరు వారిలో కొందరు బైటనున్నారు కొందరు లోపలనే యున్నారు విషయవాసనలును, (శబ్దస్పర్శాదులు) అహంకారమును యోగికి విఘ్నములు కావింతురు, ఇంద్రియములును, దేహమున్ను యోగికి బాహ్య శత్రువులు అవియోగిదృష్టిని బాహ్య ప్రపంచమునకు మరల్చి విఘ్నము లొనర్చును గావున, దేహేంద్రియాది శబ్దాది విషయములు పరమాత్మ ప్రాప్తికి ప్రత్యర్థులు (శత్రువులు) వారిని గూర్చి దిక్కులందెక్కడయున్నారని వెదకుట వ్యర్థము అందుచే ఆత్మాన్వేషకులువిషయాన్వేషపరులు కారాదు జ్ఞానులు విషయములనుండి దృష్టిని మరల్చి ప్రత్యగాత్మను వేదము లందు, ఉపనిషత్తులందు పరిశీలించెదరు సకల ప్రపంచమునకును పరమాత్మయే ప్రభువని తెలిసికొందురు సకల సృష్టికిని సాక్షిభూతుడయిన ఆత్మయే ప్రభువని తత్త్వశోధనానంతరము తెలుసుకొనెదరు

తూష్ణీంభూత ఉపాసీత, న చేష్టే మనసాపిచ
ఉపావర్త స్వతద్బ్రహ్మ అంతరాత్మని విశ్రుతమ్ ॥ 59

సకల లౌకిక విషయములను పరిత్యజించుటయే తూష్ణీం భావము తూష్ణీం భూతుడై మనస్సునందు స్థైర్యము, విషయ వాంఛలేనివాడై పరమాత్మనుపాసింపవలెను అట్లు సమస్తమునుపసంహరించుకొనినవాడై తన అంతరాత్మలోనే పరబ్రహ్మ కలడని ఎరింగి అతనినే ధ్యానించ వలెను,

మౌనాన్నస మునిర్భవతి నారణ్యావ సనాన్మునిః
స్వలక్షణంతు యోవేద సముని శ్రేష్ఠ ఉచ్యతే॥ 60

మౌనము వలన మునికానేరడు అరణ్యములో నివసించి నంత మాత్రాన మునికానేరడు "స్వ" అనగా పరబ్రహ్మ అతని లక్షణ మెరిగిన వాడే మునిశ్రేష్ఠుడని చెప్పబడుచున్నాడు

నీలకంఠ భా - అటులనే ధ్యానించినంత మాత్రాన మునికానేరడు జగజ్జన్మాది హేతువును, సచ్చిదానంద స్వరూపుడగు, ప్రత్యగాత్మను ఎరిగిన జ్ఞానియే మునిశ్రేష్ఠుడగును అతడు సన్యాసుల కంటె యోగు లకంటె శ్రేష్ఠుడు,

సర్వార్థానాం వ్యాకరణా ద్వైయాకరణ ఉచ్యతే।
తన్మూలతో వ్యాకరణం వ్యాకరోతీతి తత్తథా॥ 61

సకల వస్తువులను, వాని నామరూపములను, ప్రకృతి, ప్రత్యయాదుల ద్వారా వివరించి చెప్పగలవాడే వైయాకరణుడు, నామ రూపములన్నియు అక్షరరూపములే పరబ్రహ్మయున్ను అక్షరరూపమే "అది" నామరూపాత్మక ప్రపంచమునకును, వానిని తెలిపే శబ్దముల కున్ను మూలము వాని నన్నింటినీ చెప్పుటచే వ్యాకరణము తన్మూలమాయెను "తత్" అనగా పరబ్రహ్మము అందుచే పరమాత్మయు, ఆత్మజ్ఞానమును తెలుపువైయాకరణుడును, వైయాకరణులగుచున్నారు

నీలకంఠ భా - వ్యాకరణమునకు మూలము పరబ్రహ్మ, పరమాత్మ చేతనే నామరూపములు వివరింప బడుచున్నవి సమస్తమునకును

వ్యాకర్త పరబ్రహ్మమే వ్యాకరణ మనగా చక్కగా వివరించి నిరూపిం చుట యని అర్ధము సమస్తమునకు మూలకారణము పరబ్రహ్మము అందుచేత వైయాకరణుడు పరబ్రహ్మమే. అతడు సర్వజ్ఞుడు

ప్రత్యక్షదర్శీలోకానాం సర్వదర్శీభవేన్నరః
సత్యేవై బ్రాహ్మణస్తిష్ఠన్ తద్విద్వాన్ సర్వవిద్భవేత్ ॥ 62

లోకములన్నియు పరమాత్మ స్వరూపములే కావున లోకములను, లోకరూపుడయిన పరమాత్మను ప్రత్యక్షముగా చూచువాడే సర్వదర్శి వాడే సర్వజ్ఞుడు పరమాత్మ సత్యస్వరూపుడు సత్యమైన పరమాత్మ యందే మనసును నిలకడగా నుంచుచు, పరమాత్మ నెరిగినవాడే సర్వ వేత్తయు విద్వాంసుడు యగును

శం. భా - అనాత్మ అయిన ప్రకృతి నెరిగినవాడు సర్వజ్ఞుడు కాడు దేహాద్యాకారము సత్యపదార్థము కాదు పరమాత్మయే సత్యపదార్థము అదియే బ్రహ్మము బ్రహ్మము నెరుగుటయే జ్ఞానవిభూతి సర్వాక్షర మనగా ప్రణవమే

ధర్మాదిమస్థితోఽప్యేవం క్షత్రియ బ్రహ్మపశ్యతి
వేదానాం చాను పూర్వ్యేణ ఏతద్బుద్ధ్వాబ్రవీమితే ॥ 63

క్షత్రియా! జ్ఞానము, ధర్మము సత్యము, మున్నగువానిని అవశ్యము తెలుసుకోవలయును, అవి తెలిసినంతమాత్రాన లాభము లేదు వాని నాచరించుచూ, సత్యమునందు దృష్టినుంచినట్లే, బ్రహ్మజ్ఞానార్జనము నందునూ దృష్టినుంచవలయును మనోనేత్రము న పరబ్రహ్మను దర్శిం చవలెను అందుకై గురువుల నాశ్రయించి వేదాంత విచారము చేయ వలయును అందుచే వేదాంత విచారణ కావించవలసిన పద్ధతిని చెప్ప గలను

నీలకంఠ భా. - ధర్మము, తపస్సు, దమము, సత్యము, మున్నగు పండ్రెండున్ను మానవుడు చేయవలసినవి, అటులనే సత్యాదిరూపము లైన అష్టవిధప్రమాదములందును మానవుడు నిలకడగా యుండవలెను.

పిమ్మట సాధన చతుష్టయముచు నిత్యానిత్యవస్తు వివేకము, ఇహాముత్ర ఫలభోగ విరాగము శమాదిషట్కము, ముముక్షత్వము అను వానిని అలవాటు చేసుకొని, వేదములను, "అరోపదృష్టి, అపవాదదృష్టి వ్యామిశ్రదృష్టి" యను మార్గములను ననుసరించి పరిశీలింపపలెను ఇవన్నియును సోపానములు అపుడు, "అహమేతత్" అనేది స్వానుభవ సిద్ధిపొందగలడు

రాజా! నీపై గలస్నేహముతో నీకు చెప్పచున్నాను. "ఓతానుజ్ఞాత్రను జ్ఞావికల్పైః" అని నృసింహతాపనీయోపనిషత్ సోపానక్రమమును చెప్పచున్నది 1) "ఓతత్త్వం" అనగా కారణ వ్యాప్తి ఘటము కార్యము మట్టికారణము కారణమైన మట్టి కార్యమైన ఘటమునందు వ్యాపించి యున్నది కదా! అటులనే "సర్వం బ్రహ్మేతి, తన్నిష్ఠా జానతేపరిణామతః = ప్రకృతి యంతయు బ్రహ్మమే బ్రహ్మమందు ప్రకృతి కలదు బ్రహ్మము కారణము, ప్రకృతి కార్యము దీనినే పరిణామవాద మందురు, 2) అనుజ్ఞాత = కార్యాసమ సత్వము కారణమైన బ్రహ్మమందు, కార్యమైన ప్రకృతి సమముగాలేకున్నను భ్రాంతిచే సమానముగానున్న దనుకొనెదము, ఇది వివర్తము మృగతృష్ణలో నీరులేకున్నను, నీరువున్నదనుకొనుట ఇదియే వివర్తవాదము దీనినే అనుజ్ఞాత అందురు. 'కార్యస్యా సమసత్వం యత్కారణే సముదీరితం। తదను జ్ఞాతృ శబ్దార్ధో మరౌవారి వివర్తనమ్" అను శ్లోకము పై విషయమును నిరూపించుచున్నది, 3) అనుజ్ఞ = అనగా బ్రహ్మపదార్థము ననుసరించి జగత్తు మిథ్యయని తెలుసుకొనుట బ్రహ్మమునకు, జగత్తుకు సంబంధం లేదు జగత్తంతయు తుచ్ఛమే యని తెలుసుకొనుట ''ఏతన్నిష్ఠా తతో భూత్వాజగన్మిథ్యేతి జానతే। అనుజ్ఞాయాం జగత్తుచ్ఛం శశశృంగాదివన్మతమ్ ॥ కుందేటికి కొమ్ములు లేనట్లు బ్రహ్మమునకు, జగత్తుకు శృంగములు లేవు "ఏవం సోపాన రీత్యైవపభూమిత్రితయ లంఘనాత్। అవికల్పం పరం యత్తదహం బ్రహ్మాసి నిర్భయమ్ ॥" అను సూక్తి

ప్రకారము అవికల్పమనగా మార్పు లేనిది వికల్పము మార్పులు కలిగించుట అవికల్పమని తెలుసుకొనుటకు 1 ఓతత్త్వము 2 అనుజ్ఞాత 3 అనుజ్ఞయను మూడున్ను మేడనెక్కుటకు సోపానముల వంటివి వీటిని తెలిసికొని భూమి త్రతయమును లంఘింపవలెను అపుడు జ్ఞానియై "అవికల్పమయిన బ్రహ్మమే నేను", "అహంబ్రహ్మాస్మి' అను జ్ఞానము కలవానికి జనన, మరణరూప సంసారము వుండదు అందుచే ఓ క్షత్రియా ! నీపై కరుణతో దీనిని నీకు చెప్పితిని

ఓం తత్సత్

# శ్రీ సనత్సుజాతీయము

## చతుర్థాధ్యాయము

ధృతరాష్ట్ర ఉవాచ –

సనత్సుజాత! యామిమాం పరాంత్వం,
బ్రాహ్మీం వాచం వదసేవిశ్వరూపమ్
పరాంహికామేన సుదుర్లభాంకథాం
ప్రబ్రూహిమే వాక్యమిదం కుమార ॥

సనత్సుజాత ! నీవు చెప్పుమన్న ఈ బ్రాహ్మీవాక్కు బ్రహ్మవిద్య ఉత్కృష్టమయినది. అది నానా రూపములు కలదని చెప్పుచున్నావు ఉత్కృష్టమయిన బ్రహ్మకథ కోరిన మాత్రాన దొరకదు, అట్టి ఈ బ్రహ్మవిద్యను సనత్కుమార నాకెరిగింపుము

నీలకంఠ భా – కుమారా! నీవు చెప్పిన ఆత్మజ్ఞాన మార్గమును అలకించితిని దాని కంతరంగ సాధనమయిన యోగమును వినగోరుచున్నాను నీవు ఉపనిషత్తులలోని బ్రహ్మపదార్థవిషయమును చెప్పుచున్నావు నీవు చెప్పినదానిలో విశ్వమంతయు ప్రకాశించుచున్నది ప్రశ్నించుటకు అవకాశము లేకుండ చెప్పుచున్నావు సుదుర్లభమయిన ఆ విషయమును

వినుటకు కుతూహలుడనై యున్నాను నా ప్రార్థనను మన్నించి తెలుపుము

సనత్సుజాత ఉవాచ -

నైతత్ బ్రహ్మత్వరమాణేనలభ్యం
యన్మాం పృచ్ఛన్నపి హృష్యస్యతీవ
బుద్ధేవిలీనే మనసి ప్రచింత్యా
విద్యాహిసా బ్రహ్మచర్యేణలభ్యా ॥ 2

రాజా! తొందరపడినంతమాత్రాన బ్రహ్మవిద్య లభ్యము కాదు సుమా! నీవు నన్ను ప్రశ్నించుచునే చాలా సంతసించుచున్నావు చెప్పెదను వినుము, మనస్సును బుద్ధితో లీనము చేసి బాగుగా చింతించదగినదా బ్రహ్మవిద్య, బ్రహ్మచర్యము చేతనే అది లభ్యమగునని ఎరుగుము నీలకంఠభా - రాజా! నీవు బ్రాహ్మణ్యమును గురించి విచారించు చున్నావు ఆత్మజ్ఞానమే బ్రాహ్మణ్యము అది ''అవ్యక్తము-విద్య" అను నామముల నొప్పుచున్నది అట్టి జ్ఞానమును కొలది దినములలో పట్టు దలతో సాధించి సంపాదింప దలచుట, గర్వముతో పలుకుటయగును గురువుల కటాక్షమునను ఇంద్రియ నిగ్రహము వలనను, స్థిరబుద్ధి కలిగి బ్రహ్మచర్యమాచరించిన వారికే అది లభ్యమగును అంతేకాని రాగ, ద్వేషములు గలవారికి బ్రహ్మజ్ఞానము లభ్యము కాదు నీలో బ్రహ్మచర్యము లేదే, ఎట్లు?

ధృతరాష్ట్ర ఉవాచ -

అత్యంత విద్యామితి యత్సనాతనీం
బ్రవీషిత్వం బ్రహ్మ చర్యేణ సిద్ధామ్
అనారంభ్యాం వసతీహ కార్యకాలే
కథం బ్రాహ్మణ్య మమృతత్వం లభేత? ॥ 3

అయ్యా! బ్రహ్మ విద్య యొక్కటియే తెలిసికొనదగినది సనాతనమై నది, బ్రహ్మము చేతనే అది సిద్ధించుననుచున్నావు సృష్టిచేయు కాల

మున ఆత్మయందే యున్న బ్రహ్మము యజ్ఞ యాగాది కర్మలవలె ఆరంభింప వీలుకాదనుచున్నావు బ్రహ్మనిష్ఠగల బ్రాహ్మణులకు మాత్రమే లభించు మోక్షవిద్య నావంటివాని కెట్లు లభించునో చెపుమా!

శంకర భా – అన్నింటికి ఆది అయిన బ్రహ్మవిద్య సత్యస్వరూపమైనది దానినుండియే ప్రపంచము వెలిసినది అందుచే కారణము బ్రహ్మము కార్యము ప్రపంచము బ్రహ్మ విద్య కార్యము కాదు అసత్యమైన ప్రపంచమునకు చెందినది కాదు అది తొందరపాటుతో లభించునది కాదనీ నాకు తెలును బ్రహ్మచర్యాదిసాధన సంపత్తి కల, అంతఃకరణము ను నిగ్రహించిన వారికే బ్రహ్మవిద్య లభించుననుచున్నావు సజ్జనులు కూడ బ్రహ్మచర్యము చేతనే పొందుచున్నారనుచున్నావు బ్రహ్మవిద్య పొందినవారు మర్త్యభావమును విడుచుచున్నారని చెప్పుచున్నావు కావున నీవే గురువుగా యుండి బ్రహ్మచర్యమనగానేమో చెప్పుము

నీలకంఠ భా. – చూడగా బ్రహ్మవిద్య–అండాండ పిండాండ, బ్రహ్మాండములకు, స్థూల సూక్ష్మ, కారణ శరీరములకు, సత్వరజస్తమోగుణములకు పరిచ్ఛేదముల కతీతమయినది "యస్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ"– 'బ్రహ్మము సాక్షాత్తుగ అపరోక్షమయిన ప్రత్యగాత్మకు భిన్నముగాదు అందుచే అది సనాతనమైనది కార్యమయిన ప్రకృతిని సృష్టించు కాలమున, ఆత్మయందే యుండుటచే బ్రహ్మ విద్య, యజ్ఞాది కర్మలవలె ఆరంభింప యోగ్యము కాదు కేవలము బ్రహ్మచర్యమూ చేతనే అది సిద్ధించునని చెప్పుచున్నావు. అయినచో బ్రాహ్మణులయిన వారికి యోగ్యమయిన అమృతత్వము, మాబోటివారికెట్లు లభించునో చెప్పుము

సనత్సుజాత ఉవాచ –

అవ్యక్త విద్యామభిదాస్యేపురాణిం ।
బుద్ధ్యాచతేషాం బ్రహ్మచర్యేణ సిద్ధామ్।
యాంప్రాప్యైనం మర్త్యలోకంత్యజన్తి ।
యావై విద్యాగురువృద్ధేషు నిత్యా ॥ 4

రాజా! బ్రహ్మ విద్య అవ్యక్తము అతి ప్రాచీనము అయినను చెప్పె దను వినుమా అది బుద్ధి బలముచే లభించదు బ్రహ్మచర్యముచే మాత్రము సిద్ధించును ఆ విద్యను పొందిన పిమ్మట మానవులీ మర్త్య లోకమును విడిచెదరు సత్యమైన ఆవిద్య గురువుల చెంత జేరి తెలిసి కొనదగినదని తెలుసుకొనుము

ధృతరాష్ట్ర ఉవాచ ,-

> బ్రహ్మచర్యేణయావిద్యాశక్యావేదితు మంజసా
> తత్కథం బ్రహ్మచర్యం స్యాదేతత్ బ్రహ్మన్ బ్రవీహిమే ॥ 5

బ్రాహ్మణ్యుడా! బ్రహ్మచర్యము చేతనే బ్రహ్మవిద్యశీఘ్రముగా తెలుసు కొన శక్యము అని చెప్పుచున్నావు బ్రహ్మచర్యమే ఋజువయిన మార్గ మగుచో అది నాకెట్లు చేకూరును

సనత్సుజాత ఉవాచ -

> ఆచార్యయోని మిహయే ప్రవిశ్య! భూత్వాగర్భే
> బ్రహ్మచర్యం చరన్తి
> ఇహైవతే శాస్త్ర కారాభవన్తి। ప్రహాయదేహం పరమం యాంతి
> యోగమ్॥ 6

రాజా! బ్రహ్మ విద్యకోరు మానవుడు ఆచార్యయోనిలో ప్రవేశించి (అతని చెంతజేరి), అతనికి పుత్రులై, బ్రహ్మచర్య మాచరించి, జ్ఞాను లగుచున్నారు వారే ఈలోకమున శాస్త్రకారులగుచున్నారు వారే ఈ మానవ దేహమును వీడి ఉత్కృష్టమైన బ్రహ్మయోగమును బొందు చున్నారు

శం భా -రాజా! మానవులు ఆచార్యసమీపమునకేగి అతనినిసేవించి శిష్యులై శాస్త్రకారులగు చున్నారు శాస్త్రవేత్తలై, బాల్యయౌవనాది ధర్మముల నెరిగి, బ్రాహ్మణులై, ప్రారబ్ధకర్మ క్షయముకాగా, దేహ మునువీడి, పరమాత్మను పొందుచున్నారు జననీజనకులు పూర్వజన్మ

ఫలాను గుణమైన శరీరము ను మాత్రమిచ్చెదరు స్థూలసూక్ష్మ శరీర ములతో ఎర్పడిన దేహము అశాశ్వతము సచ్చిదానందా ద్వితీయ బ్రహ్మాత్మతో-ఏర్పడిన జన్మనుగురువేఇచు చున్నాడు అదియేజ్ఞాన స్వరూపమైన జన్మ అదియే సత్యమైనది పరమార్థమైనది కావున అమృతమయినది అందుచే ఆచార్యుడే నిజమైన తండ్రి అందుచే జీవుడుఆచార్య యోనిలో ప్రవేశించి బ్రహ్మచర్యమాచరించి, జ్ఞానియై, శాస్త్ర కారుడై పరబ్రహ్మమును చేరవలెను

"త్వంనః పితాయోఽస్మాకము విద్యాయాః పరంపారం తారయసి" (ప్రశ్నోపనిషత్) = అవిద్యను తొలగించి పరబ్రహ్మమును చేర్చునీవే మాకు తండ్రివి కానీ జన్మకారకులైన వారు తల్లిదండ్రులుకారు జన"సహివిద్యాతస్తం జనయతి తచ్ఛ్రేష్ఠం జన్మ। శరిరమేవమాతా పితరౌ యతః॥ ఆపస్తంభసూక్తి శ్రేష్ఠమైన జ్ఞానమును కలిగించినవాడే నిజమైన తండ్రి భౌతిక స్థూలశరీరమునొసగువారు సామాన్య జననీజనకులే

అస్మిన్‌లోకే వై జయంతిహకామాన్। బ్రాహ్మీం స్థితిం హ్యనుతి తిక్షమాణాః।
తేఆత్మానం నిర్హరన్తిహదేహాత్। ముంజాది షీకామిన సత్త్వ సంస్థాః॥ 7

ఈలోకమున (ఈజన్మలో) జ్ఞానులు ఐహికములైన కామములను విడచుచున్నారు ప్రతిదినము పరబ్రహ్మము నందే, తమ మనస్సు నిశ్చలత పొందునట్లు చేయుచున్నారు వారు సత్త్వమైన బ్రహ్మపదార్థము నందే స్థిరముగా నున్నవారై ముంజిగడ్డి నుండి దానిలోని కాండము ను వేరుచేసి నట్లు, దేహము నుండి ఆత్మను వేరు చేసి, దానిని పొందుచున్నారు

శరీరమేతౌకురుతః పితామాతాచ భారత
ఆచార్యశ్శాస్త్రియాజాతిః సాపుణ్యాసాజరామరా॥ 8

భారతా! లోకమున తల్లియు తండ్రియును భౌతికమైన దేహమునే నిర్మించి తమసంతానముల కొసగుచున్నారు. ఉపనయనమున గాయిత్రి నొసగి తద్ద్వారా రెండవ జన్మనొసగి శాసించువాడాచార్యుడే అతడొసగిన జన్మమే పుణ్యమైనది జరామరణరహితమైనదని తెలుసుకొనుము

యః ప్రావృణోత్య వితథేనవర్ణాః నృతం కుర్వన్నమృతం
సంప్రయచ్ఛన్।
తంమన్యేత పితరం మాతరంచ తస్మైన ద్రుహ్యేత్కృత
మస్యజానన్॥ 9

ఆచార్యుడు బ్రాహ్మణాది వర్ణములను వితథము కాని (సత్యమైన) చిచ్చైతన్యముతో నింపుచున్నాడు ఋతమయిన బ్రహ్మవస్తువును వాక్కులతో వివరించుచూ, అమృతమొసంగుచున్నాడు కావున అతనినే తల్లిగా తండ్రిగా తలంచవలెను అతడు కావించిన వుపకారమును యెరుగుచు అతని కెన్నడును ద్రోహము చేయరాదు.

శం భా -

యస్యదేవేపరాభక్తిః యథాదేవేతథాగురౌ
తస్యైతే కథితాహ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః॥

దేవుని యందుండు మహాభక్తిని గురువు యందుంచవలెను అట్టివాడే మహాత్ముడు. అతనికే చెప్పిన విషయములు చక్కగా తెలియును అంతటను చక్కగా ప్రకాశించును

నీలకంఠ భా - ఆత్మ కంటె భిన్నమయిన దంతయు జడమే అదియే అనృతము దానిని "వితథ" మందురు ఆత్మమాత్రమే సత్యమును, చిత్స్వరూపము నైయున్నది గురువు. శిష్యులకు ద్వైతభావముచే కలుగు భయమును పోగొట్టి రక్షించును

గురుం శిష్యోనిత్య మభివాద యీత స్వాధ్యాయ మిచ్ఛేచ్ఛు
చిరప్రమత్త॥

మానం నకుర్యాన్నాద ధీతరోష మేషః ప్రథమో బ్రహ్మచర్యస్య
పాదః॥ 10

శిష్యుడు నిత్యము గురువునకు నమస్కరించవలెను. తాను బాహ్యాభ్యంతర శుచియయి అప్రమత్తుడై స్వాధ్యాయము = వేదపఠనము కోరవలెను అతని చెంత ఆత్మాభిమానమును చూపరాదు (అతని బిడ్డల శౌచాదికములను ఎంతశ్రమయైనను సహించి కార్యములను చేయవలెను) మనస్సు నందైనను గురువుపట్ల కోపము వహించరాదు ఇట్లు మెలగుటయే బ్రహ్మ చర్యము యొక్క మొదటి పాదము

శిష్యవృత్తి క్రమేణైవ విద్యామాప్నోతి యశ్శుచిః
బ్రహ్మ చర్య వ్రతస్యాస్య ప్రథమః పాద ఉచ్యతే॥ 11

శిష్యుడు శుచియై సాయం ప్రాతః కాలముల యందు భిక్షావృత్తితో జీవనము చేయవలయునే గాని గురువు గృహమున అతని అన్నమును తినరాదు ఆదియే శిష్యవృత్తి క్రమము ఇట్లు ప్రవర్తించిన వానికే విద్య ప్రాప్తించును ఇదియే బ్రహ్మ చర్యము యొక్క మొదటి పాదము

ఆచారస్య ప్రియంకుర్యాత్ ప్రాణైరపిధనైరపి
కర్మణా మనసావాచా ద్వితీయః పాద ఉచ్యతే॥ 12

తన ప్రాణముచేతను, ధనము చేతను, ఆచార్యునకు ప్రియముకల్గించవలెను మనోవాక్కాయ కర్మలచేతను ప్రియమాచరించుచు, ఆచార్యుని యెడల విధేయుడై యుండ వలెను ఇదియే బ్రహ్మ చర్యము యొక్క ద్వితీయపాదము

సమాగురౌయథావృత్తి ర్గురు ర్పత్న్యాం తథాఽఽచరేత్
తత్పుత్రేచ దథాకుర్వన్ ద్వితీయః పాద ఉచ్యతే॥ 13

గురువు నందువలె గురుపత్నియందును, గురుపుత్రునియందును గౌరవాభిమానములను చూపుచు సవినయముగా ప్రియ మాచరించుట యును బ్రహ్మచర్యము యొక్క ద్వితీయ పాదమేయగును

అచార్యేణాత్మ కృతం విజానన్ జ్ఞాత్వాచార్థం భావితోఽస్మిత్యనేన
యన్మన్యతే తం ప్రతి హృష్టబుద్ధిః సవై తృతీయో బ్రహ్మచర్యస్య
పాదః ॥ 14

ఆచార్యుడు తనకు వేదవిద్యను నేర్పించిన ఉపకారమును శిష్యుడు చక్కగా గ్రహించవలెను. కృతజ్ఞుడుగా నుండవలెను అతని వేదార్థము నెరిగి అతనిచే పవిత్రుడనై తినని భావించవలెను నిత్యము అతనిపట్ల సంతుష్టబుద్ధియైయుండవలెను ఇది బ్రహ్మచర్యము యొక్క మూడవ పాదము.

నా చార్యస్యా నపాకృత్య ప్రవాసంప్రాజ్ఞః కుర్వీతనై తదహంకరోమి
ఇతీవ మన్యేత న భాషయేత సవై చతుర్థో బ్రహ్మచర్యస్య
పాదః ॥ 15

ఆచార్యుని ఋణము తీర్చనిదే ప్రవాసమునకు = గృహస్థాశ్రమము నకు పోరాదు తాను గురువుయొక్క ఋణమును తీర్చితినని యహంకరించ రాదు, అట్లు ఇతరులకు చెప్పరాదు అట్లు చెప్పినచో శిష్యుడు ప్రాజ్ఞుడు కానేరడు శిష్యుడు గురుఋణ విముక్తుడనై తినని తలచరాదు ఇట్లుమెలగుట బ్రహ్మ చర్యము యొక్క నాల్గవపాదము

కాలేనపాదం లభతేతథార్థం తతశ్చ పాదంగురు యోగతశ్చ
ఉత్సాహ యోగేనచ పాద మృచ్ఛేత్ శాస్త్రేణ పాదంచ
తతోఽభియాతి॥ 16

శిష్యునకు విద్యలో నొకటవవంతుగురుబోధవలన కలుగుతుంది రెండవ వంతు బుద్ధిబలము చేతను, మూడవవంతు సహాధ్యాయులతో చర్చిం చుట తోడను, నాల్గవవంతు తనబుద్ధి పరిపాకము తోను లభించును

ధర్మాదయోద్వాదశయస్య రూప మన్యానిచాంగాని తథాబలంచ
ఆచార్యయోగే ఫలతీతి చాహుర్బ్రహ్మార్థ యోగేనచ బ్రహ్మ
చర్యమ్॥ 17

జ్ఞానము, ధర్మము మున్నగు పంౘ్రెండు గుణములును బ్రహ్మచర్య ము యొక్క స్వరూపములు, ఆసన, ప్రాణాయామాదులు, బలము ను దానికి యితరాంగములు ఆచార్యునితో కలిసి యుండుటచేతను అతనిదయచేతను బ్రహ్మచర్యము సఫలమగును పరబ్రహ్మైక్యము పొందుటయే బ్రహ్మచర్యము యొక్క సంపూర్ణఫలము

ఏవం ప్రవృత్తోయదు పాలఖేలవై ధనమాచార్యాయ తదను ప్రయచ్ఛేత్

సతాం వృత్తిం బహుగుణా మేవమేతి గురోః పుత్రే భవతిచ వృత్తిరేషా॥ 18

నీలకంఠ భా - పైనచెప్పినట్లు ప్రవర్తించిన శిష్యుడే బ్రహ్మచర్య మును పొందును శిష్యుడెప్పుడును నేనేగురుసేవ చేసితినని అహం కరింపరాదు అహంకారమును సూచించు మాటనైనను పలుకరాదు విద్యాభ్యాసమైన తరువాత నాచార్యునకు జీవికకు తగిన ధనమునొసగ వలెను ఇట్లాచరించినవాడే బహుగుణమైన సద్వృత్తిని పొందును నైష్ఠిక బ్రహ్మచారి గురువునందువలె గురుపుత్రుని యందును సద్వృత్తి ని చూపవలెను

ఏవంవసన్ సర్వతో వర్ధతీహ బహూన్ పుత్రాన్ లభతేచప్రతిష్ఠాం

వర్షన్తి చాస్మైప్రదితోదిశశ్చ వసన్త్యస్మిన్ బ్రహ్మచర్యేజనాశ్చ॥ 19

పైనచెప్పినట్లు గురువుపట్ల మెలిగిన శిష్యుడన్నివిధము లైన ధనము తోడను వృద్ధిపొందును బహుపుత్రులను, గొప్పకీర్తిని పొందును, దిక్కు లును, విదిక్కులును వానికై ధనరాసులు వర్షించుచుం డిమ్మట సామా న్యజనులందను వానినాచార్యునిగా భావించి, వానిచెంత బ్రహ్మచర్య వ్రతమున యుందురు

ఏతేన బ్రహ్మచర్యేణ దేవాదేవత్వ మాప్నువన్

ఋషయశ్చ మహాభాగా బ్రహ్మలోకం మనీషిణః॥ 20

గంధర్వాణా మనేనైవ రూపమప్సర సామభూత్
ఏతేన బ్రహ్మచర్యేణ సూర్యోఽప్యహ్నాయ జాయతే॥ 21

బ్రహ్మచర్యము చేతనే దేవతలు బ్రహ్మత్వమును పొందిరి, ఋషులు కూడ బ్రహ్మచర్యముచేతనే ఋషిత్వమును పొంది మహాభాగులైరి మనీషులు అనగా విజ్ఞానులును బ్రహ్మచర్యము చేతనే బ్రహ్మలోక మును పొందిరి గంధర్వులైరి, అప్సరసలు చక్కని రూపమును పొందిరి, (అహ్నము = కాంతి) సూర్యుడు కూడ జగత్తులను ప్రకాశింప జేయు కాంతిని బొంది సూర్యుడాయెను

ఆకాంక్ష్యార్థ స్యసంయోగా ద్రసభేదార్థనామివ
ఏవంహ్యేతేసమజ్ఞాయ తాదృగ్భావం గతాఇమే ॥ 22

పరికింపగా బ్రహ్మచర్యమే అనేక విధముల ఫలదాయకము ఎట్లనగా చింతామణ్యాదులు రసభేదము నపేక్షించువారికి చింతితవస్తువు నొస గును అట్లేగురువు శిష్యులకు చింతితవస్తువు నొసగును ఇటులనే దేవా దులును బ్రహ్మచర్యము నాశ్రయించి వారివారి కోరికల బొందుచున్నారు ఇతరులకూ వరములిచ్చుచున్నారు

యఆశ్రయేత్పావయేచ్చాపిరాజన్ సర్వంశరీరంతపసాతప్యమానః
ఏతేనైవ బాల్యమ భ్యేతి విద్వాన్ మృత్యుంతథా సంజయ
త్యన్త కాలే॥ 23

రాజా! ప్రతి మానవుడు బ్రహ్మచర్యము నాచరించవలెను తానుపవి త్రుడై పరులను సైతము పవిత్రులుగా చేయవలయును, అట్లయినచో బాల్యమును అనగా అజ్ఞానమును వీడి విద్వాంసుడగును అతడే అంతకాలమున మృత్యువును జయించును

అంతవంతః క్షత్రియతే జయంతి లోకాన్జనాః కర్మణా నిర్మలేన
బ్రహ్మైవ విద్వాంస్తే నచాభ్యేతిసర్వం నాన్యః పంథాఽయనాయ
విద్యతే॥ 24

క్షత్రియా! నిర్మలమైన కర్మమార్గముచే జనులు నాశవంతమైన స్వర్గాదు లనే పొందుచున్నారు విద్వాంసుడు జ్ఞానియగుటచే, బ్రహ్మలోకమును బ్రహ్మపదార్థమును పొందుచున్నాడు పరికించి చూడగా పరమాత్మను చేరుటకు జ్ఞానమార్గము కంటె భిన్నమార్గములు లేవని తెలియుచున్నది

ధృతరాష్ట్ర ఉవాచ ,-

> అభాతిశుక్ల మివ లోహితమివాథో కృష్ణమథాంజనం కాద్రవంవా
> సద్బ్రహ్మణః పశ్యతియోఽత్ర విద్వాన్ కథం రూపం తదమృత
> మక్షరం పదమ్॥ 25

నీలకంఠ భా - అయ్యా! పరబ్రహ్మము అంతరాత్మలో కలదని ప్రసిద్ధ మైయున్నది దానినుపాసించునపుడు, మౌనములో నుండవలెనని, మనోనిశ్చలముండవలెననీ చెప్పచున్నారు అట్లు ఆత్మాను సంధానము నొనర్చియు ఆ పరమాత్మను దర్శించ లేక పోతిని అంతర్హృదయ మున నానావర్ణములైన నాడీమండలములే కనబడుచున్నవి దీనిని బట్టి విద్వాంసుడు హృదయమున గాంచు సద్బ్రహ్మస్వరూపము, శుక్లాది రూపమువలె, అనిశ్చితరూపమున యున్నట్లు తెలియుచున్నది అందు వల్ల అక్షరమును, అమృతమును యగు బ్రహ్మపదార్థ రూపమెట్టిదో దానిని పొందుటెట్లో చెప్పుము

విద్వాంసుడు గాంచు బ్రహ్మపదార్థము శుక్లవర్ణముగా ప్రకా శించునా? లేక రక్తవర్ణముకలదా? నల్లనిదా? అంజన వర్ణము కల దియా? కనకవర్ణమా? లేక ధూమ్రవర్ణము కలదియా? బ్రహ్మజ్ఞానియైన బ్రాహ్మణుడు గాంచు అక్షర బ్రహ్మరూపమెట్టిది? బ్రహ్మపదార్థము అమృతమే కదా! ఉత్తమ పదము కాన దానిని గూర్చి చెప్పుము (కాన వచ్చు వర్ణములు పరమాత్మవా? లేక ప్రకృతివా?)

సనత్సుజాత ఉవాచ -

> అభాతిశుక్ల మివ లోహిత మివాథో కృష్ణమాయ సమర్కవర్ణం
> నపృథివ్యాం తిష్ఠతి నాంతరిక్షే నైతత్సముద్రే సలిలం బిభర్తి ॥ 26

అయ్యా! పరమాత్మకు శుక్లలోహిత కృష్ణాయసౌర్క వర్ణము లున్నట్లు భాసించునేకాని, అతనికి ఈరంగులతో సంబంధములేదు అతడు నేల పైన, నింగిలో, సముద్రములలో లేడు అతడు సర్వవ్యాపకుడు, సర్వా ధారుడు అని తెలుసుకొనుము

శం భా – "సభగవః కస్మిన్ ప్రతిష్ఠిత? ఇతిస్వేమహిమ్ని" పరమాత్మ తన మహిమ యందేకలడు. కానీవేరెక్కడా లేడు. పరమాత్మకు వ్యాదు లులేవు. శబ్ద, స్పర్శ, రూప, గంధములు లేవు దానికేరంగులు లేవు

నతారకాను నచ విద్యుదాశ్రితం నచాభ్రేషు దృశ్యతే రూపమస్య
నచాపివాయౌ నచదేవతానుత నైతశ్చంద్రే దృశ్యతే నోత
సూర్యే॥ 27

పరమాత్మ నక్షత్రములందు లేడు విద్యుత్తు నాశ్రయించియులేడు పరమాత్మ రూపము మేఘములందు చూడబడదు అదివాయువునం దు కానీ దేవతలందు కాని, సూర్య చంద్రులందుకానీ కానరాదు

నైవఋక్షు తన్నయజుఃషునాప్యథర్వను నదృశ్యతే వైవిమలేషు
సామను
రథంతరేబార్హద్రథేవాపి రాజన్ మహావ్రతే నైవ దృశ్యేద్ధ్రు
వంతత్॥ 28

అయ్యా! పరమాత్మరూపము లేనివాడు కాన ఋగ్యజుస్సామాథర్వ ములందులేడు రథంతరమందును, బార్హద్రథమందును అతను కన బడడు పరమాత్మధ్రువమైనది. పరమాత్మ నిత్యుడు, మహావ్రతుడు అందుచే అనిత్యమైన కర్మమార్గమందు గోచరించడు, నాస్త్యకృతః కృతేన = అకృతమైన మోక్షము కృతముచే (కర్మచే) లభించదు మహావ్రతుడైన జ్ఞానికి మాత్రము గోచరించును)

ఆపారణీయంతమసః పరస్తాత్ తదంతకోఽప్యేతి వినాశకాలే
అణీయోరూపం క్షురధారయా సమం మహచ్చ రూపం తద్వై
పర్వతేభ్యః॥ 29

నీలకంఠ భా ,- పరమాత్మ తమోరూపమైన అజ్ఞానము కంటె భిన్న మైన జ్ఞాన స్వరూపుడు ఉత్కృష్టుడు అహేయుడు కావున అతని నతి క్రమింపనెవరికి సాధ్యము కాదు ప్రళయమున అందరిని నాశముచేయు అంతకుడును (యముడును) అతనిలోనే అణగియుండును అతనిరూప ము అణువు కావున దుర్లక్ష్యము (చూడశక్యము కానిది) అదిక్షుర ధారతో సమానము పర్వతములకంటె మహత్తరమైనది అందుచే యోగులకు పరమాత్మయొక్క అణురూపమును, మహారూపముకు కానవచ్చును,

స్వప్రతిష్ఠా తదమృతం లోకాస్తద్బ్రహ్మ తద్యశః
భూతానిజజ్ఞిరే తస్మాత్ ప్రళయం యాంతి తత్రహి॥ 30

బ్రహ్మమే సమస్తమునకును ఆధారము అదియే అమృతము అది యే లోకప్రకాశకము అదియే యశన్సు దానినుండియే భూతము లుద్భవించి, దానియందే ప్రకాశమునొందు చున్నవి అనిజ్ఞానులు తెలుసుకొనిరి

నీలకంఠ భా - "సత్యనామ మహద్యశః"-శ్రుతి బ్రహ్మమే యశ స్సు, బ్రహ్మము నుండియే పృధివ్యాది భూతములు వెలువడుచున్నవి కుండలాదులకు కనకమువలె భూతముల కదియే ఉపాదాన కారణ ము మట్టియందు ఘటము వలె దానియందే లయించుచున్నవి, "యతోవాఇమాని భూతాని జాయంతే" - శ్రుతి

అవామయం తన్మహదుద్యతం యశోవాచోవికారం కవయోవదన్తి
యస్మిన్ జగత్సర్వ మిదంప్రతిష్ఠితం యఏతద్విదు రమృతాస్తే
భవన్తి॥ 31

పరమాత్మ ఆకలి, దప్పిక శోకము, మోహము , జర, మృతువులు

యనెడి అరుఆమయములు అనగా రోగములు లేనివాడు ఇవిప్రకృతి ధర్మములు పరమాత్మమహత్ స్వరూపుడు (జగదాకారమున వ్యక్త మగుచున్నాడు.) ధ్యానించువారికి యశస్సుగా కానవచ్చును. నిర్మల మైనవాడు "నిర్మలంచ యశస్కృతం" = కవులతనికి అనేక వాక్కులతో వికారములను కల్పించి వాక్రుచ్చుచున్నారు (వాచారంభణంవికారో నామధేయం = కవులు అయానామములతో పరబ్రహ్మమునకు వికార ములు కల్పించుచున్నారు) అతనియందే సర్వ లోకములును ప్రతిష్ఠిం పబడియున్నవి ఈ విషయము నెరిగినవారు తప్పక ముక్తులగుదురు (ఈ జగత్తు కేవలము భ్రాంతియేగానీ నిజము కాదు. రజ్జువు నందు సర్పమారోపింపబడినట్లు)

చతుర్థాధ్యాయం సమాప్తం

# శ్రీ సనత్సుజాతీయము

## పంచమాధ్యాయము

**అవతారిక** - ఇంతవరకు జ్ఞానప్రాధాన్యమును, యోగోపసర్జనమగు బ్రహ్మవిద్యను వివరముగా చెప్పబడినది పిమ్మట యోగము ప్రధానము గను, జ్ఞానమప్రధానముగల బ్రహ్మవిద్యగను, ఈ అధ్యాయద్వయమున సనత్సుజాతుడు చెప్పుచున్నాడు

శోకః క్రోధశ్చలోభశ్చ కామోమానః పరాసుతా।
ఈర్ష్యామోహోవిధిత్సాచ కృపాసూయాజుగుప్సతా ॥ 1

చిత్తవృత్తినిరోధముచే తొలుత. "త్వం" పదార్థము ను తెలిసికొని పిమ్మట వేదాంత శ్రవణాదులచే "బ్రహ్మ" పదార్థముగా నిశ్చయించుటయే మొదటి పద్ధతి మొదట శ్రవణాదులచే పరోక్షజ్ఞానము ననుసరించి, ప్రత్యగాత్మనే బ్రహ్మముగా నిశ్చయించి.పిమ్మట నిధి ధ్యాసముచే దానినే అపరోక్షముగా నొనర్చుట రెండవపద్ధతి క్రమముగా రెండింటియందు

ఫలమొకటియే యగుటచే, సాధన జాతము కూడ ఏకరూపమేయని నిరూపించుటకు తొలుత చెప్పబడిన హేయదోషములను, ఉపాదేయ ము లను గుణములను శోకః క్రోధశ్చ మున్నగు శ్లోకములలో నిరూపిం చుచున్నారు

శోకము, క్రోధము లోభము, కామము , మానము, పరానుత = నిద్రాపరుడై యుండుట, ఈర్ష్య, మోహము, విధిత్స, కృప (ఇక్కడ దయకాదు) = స్నేహానికి రూపాంతరము, అసూయ, జుగుప్స-అను పండ్రెండును మనుష్యుల ప్రాణము లను నశింపజేయు దోషములు ఇవన్నియును తత్త్వమునకు అవరణములై, దానిని కానరానీయవు వానిని నిరోధించుటకు మానవులు ప్రయత్నించవలెనని మరల మరల చెప్పుచున్నాడు

ద్వాదశైతే మహాదోషా మనుష్యప్రాణనాశనాః
ఏకైకమేతే రాజేంద్ర మనుష్యాన్ పర్యుపాసతే
యైరావిష్టో నరః పాపం మూఢసంజ్ఞోవ్యవస్యతి ॥ 2

రాజేంద్రా! మనుష్య ప్రాణనాశకములయిన పండ్రెండు దోషము లలో ఒక్కొక్కటియే మానవుల నాశ్రయించి పీడించుచున్నది మానవుడు వీటిచే ఆకృష్టుడై మూఢబుద్ధియై పాపకర్మల నాచరించును వాడు మూఢసంజ్ఞకనబడును

స్పృహయాళురుగ్రః పరుషోవావదాన్యః క్రోధంబిభ్రన్ వనసావై వికత్థీ
నృశంసధర్మాః షడిమే జనావై ప్రాప్యాప్యర్థం నోతసభాజయన్తే॥ 3

రాజా! వీనికి తోడుగా ఆరుగురు నృశంసధర్ములు కలరు వారు హింసా శీలురయిన ఘాతకులు వీరు ధనవంతులైనను, పరులను గౌరవించరు తాము ధనముతో సుఖమనుభవించరు వారు 1 స్పృహయాళువు = లబ్ధమైనదానిని వినియోగించక ఉత్తరోత్తరముకావలెనని కోరుట = లోభ గుణము, 2 ఉగ్రుడు = నిర్దయుడు; 3 పరుషుడు = మొరటుగా

మాట్లాడువాడు. 4 వదాన్యుడు = ఏక్కువగా మాట్లాడువాడు లేక అవ దాన్యుడు = దానమును చేయనివాడు. 5 క్రోధనుడు. 6 వికత్థి = స్వంత గొప్పలు చెప్పకొనువాడు. ఇతరులకపకారము చేయువానిని "విప్రకర్షి" యనెదరు.

సంభోగసంవిత్ విషమోఽతిమానీ దత్త్వావికత్థీ కృపణోదుర్బలశ్చ
బహు ప్రశంసీ వనితా ద్విట్ సదైవసప్తైతే స్తాః పాపశీలా
నృశం సాః ॥ 4

పై ఆరుగురేగాక మరి ఏడుగురు నృశంసులుగలరు. వారు 1) సంభోగవిత్ = వనితాసంభోగ చింతగలవాడు 2) విషముడు = అడ్డముగా మాట్లాడువాడు శకునివలె కలహములు పెట్టువాడు. 3) అతిమానీ = రావణుని వంటివాడు. 4) దత్వావికత్థనుడు = ఇతరులకు దానమిచ్చి ఇచ్చినందుకు పరితపించువాడు 5) కృపణుడు 6) దుర్బలుడు. 7) బహుప్రశంసీ = ఆత్మస్తుతి చేసుకొనెడివాడు వనితాద్విట్ సదైవ = తనభార్యను కూడా ద్వేషించువాడు (పంద్రెండు దోషములుగల వారు) పదమువ్వురు నృశంసులును. బ్రహ్మబంధకులని చెప్పచున్నారు.

ధర్మంచ సత్యంచతపోదమశ్చ అమాత్సర్యంహ్రీస్తి తితిక్షానసూయా
దానం శ్రుతం చైవ ధృతిః క్షమాచ మహావ్రతా ద్వాదశ
బ్రాహ్మణస్య॥ 5

బ్రహ్మవ్యంజకములైన మహావ్రతములను చెప్పచున్నాడు. ఈ మహావ్రతములు అదృష్టమైన బ్రహ్మవస్తువు నెరుగుటకు సాధనములు ఇవి బ్రహ్మజ్ఞాన మార్జింపదలచిన బ్రాహ్మణులు ఆచరింపవలసిన వ్రతములు. ఇవి పంద్రెండు. 1) ధర్మము 2) సత్యమూ 3) తపస్సు 4) దమము 5) అమాత్సర్యము 6) హ్రీ 7) తితిక్ష 8) అనసూయ 9) దానము 10) శ్రుతము 11) ధృతి 12) క్షమ (తపోదాన స్వరూపమే యజ్ఞము కావున దానిని ప్రత్యేకముగా మహావ్రతము లలో చెప్పబడలేదు)

యోనైతేభ్యః ప్రచ్యవేద్ద్వాదశభ్యః సర్వామపీమాం పృథివీం
సశిష్యాత్
త్రిభిర్ద్వాభ్యామేకతో వార్థితోయో నాస్య స్వమస్తీతి చవేది
తవ్యమ్॥ 6

మహావ్రతములయిన ధర్మాదులయిన పండ్రెంటిని విడనివాడు ఈ సమస్త పృథివిని శాసించగలడు వీటిలో ఒకటిగానీ రెండు గానీ, మూడుగానీ కలవాడు ఏ ఒక్క వ్రతమందైనను, పక్షపాతము కలవాడై వుండినచో వాడు సకల ఐహిక వాంఛలను వదలిపెట్టును వానికి స్వార్థమే వుండదు ధర్మాదులలో యే ఒక్కటి వున్నను మానవుడు పండ్రెండింటిని ఆసక్తితో ఆచరించును వానికిగల శోకమోహాదులన్నియు నశించును సందేహము లేదు వాడు సకల పృథివిని శాసించగలడు దానికి పృథివీగ్రహణ దోషము లేశమంతైనను వాటిల్లదు

దమస్త్యాగోఽప్రమాద ఇత్యేతేష్వమృతం స్థితం
ఏతానిబ్రహ్మముఖ్యానాం బ్రాహ్మణానాం మనీషిణామ్ ॥ 7

పై పండ్రెండు వ్రతములలో దమము త్యాగము అప్రమాదము అను మూడింటిలో అమృతము కలదు పరబ్రహ్మప్రాప్తియే ముఖ్యమని తలంచునట్టి మనీషులు అగు బ్రాహ్మణులకు పై మూడును ముఖ్య కర్తవ్యములు

సర్వజ్ఞ భా .- వేదోక్త కర్మలకు కూడ దమము, త్యాగము, అప్రమాదము ముఖ్యముగా ఆచరింప వలసిన ధర్మము లు పై మూడును కర్మ పరులను స్వర్గమునకు పొందించును కర్మప్రవృత్తులు అత్యంతము సత్యమును పాటించలేరు అనృతమిశ్రమమైన సత్యవ్రతమునయినను, కర్మపరులు ఆచరించలేరు అందుచే మరల జన్మించుచున్నారు జ్ఞానులు నిష్కాములు,

సద్వాఽసద్వాపరీవాదో బ్రాహ్మణస్య నశస్యతే
నరప్రతిష్ఠాస్వైవె సుర్యవివం కుర్వతే జనాః ॥ 8

నీలకంఠ భా — పరుల దోషములను ప్రకటించి పలుకుటయే పరివాదము యదార్థమైనను ఆరోపితమైనను పరివాదము గావించుట బ్రాహ్మణునకు మంచిదికాదు బ్రాహ్మణునకేగాక బ్రహ్మజ్ఞానియైనచో ఏజాతికి చెందినవానికైనను మంచిది కాదు పరివాదము కావించు జనులు నరకమున బడుదురు

మదోఽష్టాదశ దోషస్స్యాత్పురాయోఽప్రకీర్తితః
లోకద్వేష్యం ప్రాతి కూల్యమభ్యసూయామృషావచః॥ 9

కామఃక్రోధౌ పారతంత్ర్యం పరివాదోఽథపైశునం
అర్థహానిర్వివాదశ్చ మాత్సర్యం ప్రాణి పీడనం॥ 10

ఈర్ష్యామదోఽతివాదశ్చ సంజ్ఞానాశోఽభ్యసూయితా
తస్మాత్ప్రాజ్ఞో నమాద్యేత సదాహ్యేత ద్విగర్హితమ్॥ 11

1) లోకద్వేష్యము = ద్వేషభావము 2) ప్రాతికూల్యము = ధర్మకార్యాలకు విఘ్నము కలిగించుట 3) అభ్యసూయ = గుణవంతులందు దోషమునారోపించుట 4) మృషావచనము = అసత్యము పలుకుట 5) కామము = స్త్రీలను కోరుట 6) క్రోధము = ఇతరులపై ఆగ్రహించుట 7) పారతంత్ర్యము = వ్యసనములకు (మద్యపానాదులకు) బానిసయగుట మంచిచెడులనాలోచింపక ఇతరులు చెప్పినట్లుచేయుట 8) పరివాదము = ఇతరులతో విపరీతముగా వాదించుట 9) పైశునము = పరుల దోషములను చూపుట, పరులగుణములు నశింపవలెనని కోరుట, 10) అర్థహాని = ప్రయోజనముల పాడుచేయుట, జూదము-వేశ్యలపైధనము ఖర్చుచేయుట, 11) వివాదము = కలహము, 12) మాత్సర్యము 13) ప్రాణహింస 14) ఈర్ష్య = ఇతరుల మంచిగుణములను ద్వేషించుట 15) మోదము = గర్వముతో ఆనందించుట 16) అతివాదము = మర్యాదగా మాటలాడకుండుట 17) సంజ్ఞానాశము = మంచిచెడ్డల వివేకము లేకుండుట చదివిన వేదాదులను విస్మరించుట. 18) అభ్యసూయత = నిరంతరము పరద్రోహ శీలురై యుండుట.

ఇవి పదునెనిమిది మద దోషములు ఆపత్కాలమందైనను పైదోష ములు మానవునిలో యుండరాదు

సౌహృదే వైషడ్గుణా వేదితవ్యాః। ప్రియేహృష్యన్త్య ప్రియే చవ్య థన్తే స్వాదాత్మన స్సుచిరం యాచతే। యోవధాత్యయాచ్యమపిధ్యేయం ఖలుస్యాత్ ఇష్టాన్ పుత్రాన్ విభవాన్ స్వాంశ్చ దారానభ్యర్థితశ్చార్హతి శుద్ధభావః॥ 12

వీనితోబాటు మిత్రులకు చెందిన యారు సుగుణములను కూడ తెలిసి కొనవలెను అవేమనగా శత్రువులు సైతము వారి నిమిత్తముగా చేసిన దానము చేమిత్రులగు చున్నారు అందుచే మిత్రవిషయకమైన త్యాగ మున మానవుడు మంచిహృదయముగల వాడై త్యాగము చేయవల యును 1 మిత్రునికి చెందిన గుణములలో మొదటిది స్నేహితునకు ప్రియము కలిగిన ఆనందించుట కర్తుడు) 2 అప్రియము కలిగిన పుడు వానిపట్ల వ్యథ చెందుట అదృష్టమైన స్వర్గాది సుఖమునకు త్యాగమే కారణము, పూర్వోక్తమైన త్యాగమునకు, దీనికిని భేదము కలదు, ఈ త్యాగమునకు చెందిన ఆరు గుణములలో పైన పేర్కొని న రెండు ప్రియమనగా సుఖసాధనమైన ధర్మము 1) మిత్రుని విష యమై జరిగిన అప్రియమును అనగా దుఃఖహేతువైన అధర్మమును తెలిసికొనవలెను అట్టి అధర్మము మానవుడు పాపహానికై దానము చేయవలెను, ఇదిత్యాగ గుణములలో రెండవది - తనకిష్టమైనట్టియు పుష్టికరమైనవస్తువును అడిగినపుడు, అయాచ్యమైనను, దాత ఈయవలెను యాచింపరాని పుత్రాదులను యాచించిననూ, వాటిని ఇచ్చిన వాడే దాత, తనకిష్టమైన భార్యాబిడ్డలను విభవములను అడగరాదు. అవి అయాచ్యములు అట్టివాని నడిగననూ, దుఃఖింపక దానముచేయు వాడేదాత, ఇట్టిత్యాగము చేయుట మూడవ గుణము

త్యక్త ద్రావ్యస్సంవసే స్నేహ కామా
ద్భుంక్తే కర్మస్వాశిషం బాధతేచ॥ 13

తాను సర్వస్వమును ఒకనికిచ్చి తనచేయుపకారమును పొందెనను బుద్ధితో వానిగృహమున నివసింపరాదు ఇహలోకమున బాగుగ సుఖిం పవలెనను తలంపుతో నుండక, బుద్ధిపూర్వకముగా తనకుగల ద్రవ్యము నంతటినీ త్యాగము చేయవలెను అయాచిత బ్రహ్మణులకు తనద్రవ్య యును త్యాగపూర్వకముగా ఇవ్వవలెను ఇదినాల్గవ త్యాగగుణము ') స్వకర్మార్జిత ధనమునే అనుభవింపవలెను కానీ మిత్రాద్యార్జిత ధనము ననుభవింపరాదు కాలాంతరమున వారు హేళన చేసిరేని స్నేహభం గము జరుగును పూర్వజన్మ కర్మఫలముగా సుఖదుఃఖముల నను భవింపవలెను ఇహలోకమున కర్మభూమిలో కామము ననుభవింపరా దు వ్రతమధ్యమున ఐహికసుఖ కామముచే ఇష్టార్థమైన తపస్సునకు భంగము కలుగును, (అట్లు భంగము కలుగరాదు) ఐహికసుఖ వాం ఛాత్యాగము ఐదవది కొందరు మిత్రహితమునకై తమశ్రేయస్సును కూడా వదలుకొందురు స్వస్థానమూలైన రాజ్యాదికములను సైతము త్యజింతురు అప్రయత్నముగా లభించిన ప్రాచీన కర్మఫలమునే అను భవించెదరు తమమనస్సునకు కలిగిన బాహ్యభయమును తొలగిం చు కొనెదరు ఇది ఆరవ త్యాగగుణము

ద్రవ్యవాన్ గుణవానేవం త్యాగీభవతి సాత్వికః
పంచభూతాని పంచభ్యో నివర్తయతి తాదృశః॥ 14

నీలకంఠ భా ,- ధనికుడైన గృహస్థుడు ఈ చెప్పిన రీతిని ప్రవర్తించినచో గుణవంతుడును, త్యాగబుద్ధిగలదాతయు, సత్త్వగుణ ప్రధానుడును సుఖశీలయునగును అతడే పంచభూతములనుండి పుట్టుటచే పంచభూతమూలైన చెవులు, ముక్కు, కండ్లు, నాలుక, చర్మము అనెడి జ్ఞానేంద్రియములను, పంచభూత ప్రకృతులైన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధముల నుండి మరల్చును

ఏతత్స మృద్ధ మప్వూర్వం తపోభవతి కేవలం
సత్త్వాత్ ప్రచ్యవ మానానాం సంకల్పేన సమాహితమ్॥ 15

ఇంద్రియ విషయములయిన శబ్దస్పర్శాదుల నుండి ఇంద్రియములను మరల్చుటయే పుష్కలమైన తపస్సు ఆక్లేశవలమైన తపస్సే ఊర్ధ్వ గతి నొందించును దీనినే సమృద్ధమైన తపస్సందురు ఇది జ్ఞానము వలె ఇహమందే కృతకృత్యత చేకూర్చదు విషయవాస నలనుండి ఇంద్రియములను మరల్చినవాడు తీవ్రమైన వైరాగ్యము లేనికారణ మున సత్త్వము నుండిఆత్మనుండి భ్రష్టులగుదురు (ప్రచ్యమానము = పొందెదరు)వారికి ఊర్ధ్వలోకభోగముల ననుభవింప వలెననెడి సంకల్ప ము మాత్రము దృఢముగా యుండుటచే తత్త్వజ్ఞానులు కారు వారు స్వర్గాదులనే పొందెదరు

యతోయజ్ఞాః ప్రవర్తన్తే సత్యైస్యైవావరోధనాత్।
మనసాన్యస్యభవతి వాచాన్యస్యాథ కర్మణా॥ 16

సంకల్పముచేతనే యజ్ఞములు వృద్ధిపొందుచున్నవి ద్రవ్య, తపో, యోగ, స్వాధ్యాయ, జ్ఞానయజ్ఞములని యజ్ఞములు పలువిధములు ద్రవ్యయజ్ఞము లో సత్యసంకల్పమునకు అవరోధము కలుగును. కావు న వారికి స్వర్గ భోగములు మాత్రమూ కలుగును కర్మమార్గమున బడినవారికి సంకల్పాపేక్షలు అధికము గా యుండును కానీ, కర్మ ఫలమపేక్షింపక కర్మయజ్ఞము చేసినవాడు తప్పక ముక్తినొందును

అసంకల్పః సిద్ధం పురుషమసంకల్పోఽధితిష్ఠతి
బ్రాహ్మణస్య విశేషేణ కించాన్యదపి మే శృణు॥ 17

సగుణబ్రహ్మోపాసనచే, సంకల్పసిద్ధుని(సత్యసంకల్పుడైన పురుషుని) అసంకల్పుడు = చిదాత్మ, రాజుభృత్యునివలె అధిష్ఠించి యుండును, అతనికి అనన్యాధి పత్యము లభించును అనగా ఈశ్వరాంతరుడగును నిర్గుణో పాసకుడైనవాని సంకల్పవిశేషముచే అనగా నిష్కామత్వము చే, అసంకల్పుడైన చిదాత్మ ఆవేశించి యుండును సగుణో పాసకు నికంటె నిర్గుణో పాసకునిలో సత్యసంకల్పత్వాదికము అతిశయముగా అవిర్భవించునని, రాజా! నావలన నీవు తెలిసికొనుము,

సర్వజ్ఞ. భా - నిత్యకర్మలయిన యజ్ఞయాగాదికము లొనర్చునప్పుడు సంకల్పము చెప్పవలెను అయినను కర్మిష్ఠుడు ఈశ్వరార్పణ బుద్ధితో కర్మలాచరించినప్పుడు సంకల్ప సిద్ధుడగును. సంకల్పానంతరమే వాడు అసంకల్పుడగును బ్రహ్మోపాసకుడు నిత్యకర్మలాచరించినను, సంకల్పము చెప్పడు అందుచే, దేవ, పితృ, భూత, మనుష్య బ్రహ్మ యజ్ఞములను చేయునప్పుడు సంకల్పము చెప్పరాదు

అధ్యాపయేన్మహ దేతద్యశస్యం వాచోవికారాః కవయోవదన్తి
అస్మిన్ యోగేసర్వమిదం ప్రతిష్ఠితం యవిత ద్విదురమృతాస్తే
భవన్తి॥ 18

నీలకంఠ భా . అధ్యాత్మ ప్రతిపాదకమైన యీ యోగశాస్త్రమును, శిష్యులచే గ్రహింపజేయవలెను యశస్సుకొరకు బ్రహ్మప్రాప్తికి, ఇది చాలా అనుకూలమైనది ఈ యోగశాస్త్రము కంటె భిన్నమైన శాస్త్రములన్నియు పరమాత్మ ప్రతిపాదనకు సూటిగా సాధనములుకావు పరంపరా సాధనములు మాత్రమే యగుచున్నవి అందుచే వానిని వాచోవికారములుగా కవులు చెప్పచున్నారు (కావున మానవుడు ఈ యోగము నలవరచుకొని చరాచరమయినఈ ప్రపంచమంతయు సత్యస్వరూపమే యని తెలిసికొనినచో వాడు అమృతుడు = ముక్తుడు అగును.

నకర్మణా నుకృతే నైవరాజన్ సత్యంజయేజ్జుహు యాద్వాయజేద్వా
నైతేన బాలో౽మృత్యుమభ్యేతి రాజన్ రతించాసౌ నలభత్యంత
కాలే॥ 19

సర్వజ్ఞ భాష్యం ,- రాజా! కర్మచే సత్యమైన బ్రహ్మపదార్థము ను బొందలేరు కర్మవలన ఆత్మతత్త్వజ్ఞానము మాత్రమే కలుగును అందుచే ముక్తి కలుగదు వేవనము చేతనే ముక్తికలుగును, సుకృతరూపమైన కర్మచే ముక్తికలుగును బాలుడు అజ్ఞానియగుటచే దేహ విసర్జన రూపాన్త కాలమందు సుకృతము నశించుటచే, సుఖమేగాక

మోక్షానందమును కూడ పొందలేడు జ్ఞానియైన ప్రహ్లాదునివలె నిష్కా
ముడైన కారణమున సుకృతమునొంది జపహోమయాగము లాచరిం
చినను, అమృతత్వమును పొందగలడు

తూష్ణీమేక ఉపాసీతచేష్టేతమన్త సాపిచ
తథాసంస్తుతి నిందాభ్యాం ప్రీతిరోషౌ విసర్జయేత్ ॥ 20

దైవధ్యానము చేయునపుడు ఒంటరిగా నుండవలెను మౌనముగా
నుండవలెను అవికల్పముగు అద్వితీయమగు బ్రహ్మమునుపాసిం
పవలెను ధ్యానించవలెను కర్మేంద్రియ జ్ఞానేంద్రియముల నిగ్రహిం
చినను మనస్సు చలించినచో, మనస్సులో తలంపులున్నచో అతడు
మిథ్యాచారియగును జ్ఞాని నిందాస్తుతులకు రోషము చెందరాదు పొంగి
పోరాదు,

అత్రైవతిష్ఠన్ క్షత్రియ బ్రహ్మవిశతి పశ్యతి
వేదేషుచాను పూర్వ్యేణ ఏత ద్విద్వన్ బ్రవీమితే॥ 21

ఓ క్షత్రియుడా! 1) ఆరోపదృష్టి 2) వ్యామిశ్రదృష్టి 3) అపవాద
దృష్టి, యనెడి దృష్టిభేదములనే వేదములందును అనగా జ్ఞానమని
అర్థము వేదములందలి భేదదృష్టిక్రమముగా శిక్షించనచో, తత్త్వజ్ఞానము
చక్కగా కలిగినచో, ఈజన్మమందే మానవుడు బ్రహ్మమును పొంద
గలడు జీవుడు పరబ్రహ్మముతో తాదాత్మ్యమును పొందును మహా
కాశ ఘటాకాశ న్యాయము ననుసరించి జీవుడు బ్రహ్మములో లీన
మగును అజ్ఞానము నశించినతోడనే ఉపాధి విలయముచే జీవుడాత్మ
తో తాదాత్మ్యమును పొందును కర్మమార్గమున యున్నంతకాలము సకా
ముడగుటచే, పరబ్రహ్మమును పొందలేడు, కర్మమార్గమున యున్నను
నిష్కాముడగుటచే జ్ఞాని బ్రహ్మ సాక్షాత్కారమును పొందగలడు

కర్మమార్గము అదృష్టార్థ, వినాశఫలము జ్ఞానమార్గ మనగా బ్రహ్మవిద్య
దృష్టార్థము అనంత ఫలము విద్వాంసుడా! కావున కర్మకంటె బ్రహ్మ

విద్యయే శ్రేష్ఠమైనదని తెలిసికొని జ్ఞానము కొరకే ప్రయత్నించ వలె నని నీకు నేను చెప్పుచున్నాను

ఐదవ అధ్యాయము సమాప్తము

# శ్రీ సనత్సుజాతీయము

## షష్ఠాధ్యాయము

యత్తచ్ఛుక్రం మహజ్జ్యోతి ర్దీప్యమానం మహద్యశః తద్వై దేవా
ఉపాసతే తస్మాత్సూర్యో విరాజతే యోగినస్తం ప్రపశ్యంతి
భగవంతం సనాతనమ్॥

జ్ఞాతఇతిజ్ఞానమ్—తెలిసికొనబడినదియే జ్ఞానముచంద్రాంశమైన మనస్సును సూర్యాంశమైనబుద్ధిని ఏకముచేసి ధ్యానమార్గమున తెలిసికొనబడిన పరమాత్మస్వరూపమే జ్ఞానము ఆపరబ్రహ్మము శుక్రము ఆశుక్రమే పరిశుద్ధమై విశ్వోత్పత్తికి బీజమగుచున్నది అదియే పరంజ్యోతి అదియే తేజస్సు "శుక్రమని, జ్యోతిరని తేజోసి"–ఆ శుక్రమే పగలు రాత్రి అనురూపములతో నుండి విషురూపములుగా అనగా విలక్షణమైన రూపము గలదై లోకమాత్రకు కారణమగుచున్నది. శుక్రమనగా పరమశుద్ధమైనది అదియే మహత్తు (విశ్వోత్పత్తికి మూలకారణము) అన్నింటినీ ప్రకాశింపజేయు మహాజ్యోతి, స్వయంప్రకాశమానము, అన్నింటికీ సుఖ సాధనమగుటచే మహాయశస్సుగా నున్నది దేవత లందరూ ఆపరమాత్మనే ఉపాసించుచున్నారు ఆపరమాత్మ వలననే సూర్యుడు ప్రకాశించుచున్నాడు. అట్టిపరమాత్మను యోగులు సవికల్ప నిర్వికల్ప సమాధులలో, విభిన్నరూపముల గాంచుచున్నారు పై సమాధులనే సంప్రజ్ఞాత అసంప్రజ్ఞాత సమాధులనికూడా చెప్పబడుచున్నవి పరమాత్మకు నానారూప కల్పములనెడి వికల్పములు గావించుకొని,

సర్వై శ్వర్యవంతునిగా పరబ్రహ్మను గావించుట సవికల్పసమాధి అది యే సంప్రజ్ఞాత సమాధి నిర్వకల్ప సమాధిలో పరమాత్మపట్ల వికల్ప ములు లేవు అందు పరమాత్మను సనాతనునిగా, అఖండైకరసునిగా ఏకాకారునిగా గాంచెదరు ఆదుచే అది అసంప్రజ్ఞాత సమాధియగు చున్నది, ఇవి జ్ఞానులకును, యోగులకును సులభముగా పట్టుపడును

శుక్రాద్బ్రహ్మ ప్రభవతి బ్రహ్మశుక్రేణ వర్ధతే తచ్ఛుక్రం జ్యోతిషాం
మధ్యేఽతప్తం తాపనం యోగినస్తం ప్రపశ్యన్తి భగవంతం
సనాతనమ్॥ 2

శం భా. ,- ఏమ్మట పరాత్పరుడును, హిరణ్యగర్భుడును అగు పర బ్రహ్మము నుండియే ఉత్పత్తి జరుగుచున్నదని నిరూపించుచున్నారు.

పూర్వోక్తమైన శుద్ధ బ్రహ్మమే శుక్రము అదియే పరము. దాని నుండి హిరణ్యగర్భుడను పేరు గలబ్రహ్మ ప్రభవించెను ఆహిరణ్య గర్భుడు విరాట్టు అనబడు పరమాత్మచే వృద్ధి పొందుచున్నాడు అట్టి పరబ్రహ్మము ఆదిత్యాది జ్యోతిస్సుల మధ్యనున్నను వానిచే ప్రకా శింపబడక తానే స్వయముగా ప్రకాశించుచున్నాడు

నీలకంఠ భా – ఇకచెప్పబోవు శ్లోకములన్నియు ఈశ్లోకార్థమునే వివ రించుచున్నవి అనంతమను పేరుగల శుక్రము నుండియే బ్రహ్మ పదార్థము ప్రభవించుచున్నది అదియే పరమవ్యోమమనియు, అవ్యా కృత మనియు పిలువ బడుచున్నది బ్రహ్మము "సత్" అయినను' చైతన్య ప్రతిబింబమును పొంది, జగత్ సృష్ట్యాది కార్యముల కావిం చుటకు సమర్థమగు చున్నది దాని నుండియే వృద్ధి పొందుచున్నది, శుక్రమైనబ్రహ్మపదార్థము, సూర్యాదిజ్యోతిస్సుల మధ్యనుండి ప్రకాశిం చుచున్నది.

యాదాదిత్యగతంతేజో జగద్భాసయతేఽఖిలం యచ్చంద్రమసి
యచ్చాగ్నౌ తత్తేజోవిద్ధి మామకమ్॥ భీషాస్మాద్వాతః పవతే

భీషోదేతిసూర్యః భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చమృత్యుర్ధావతిపంచమః॥

అపోఽథ అధ్వస్సలి లస్యమధ్యే ఉభౌదేవౌ శ్రియాతేఽంతరిక్షే
అతంద్రిత స్సవితుర్విపస్వా న ఉభౌఖిభర్తి పృథివీం దివంచ
యోగినస్తం ప్రపశ్యంతి భగవంతం సనాతనమ్॥ 3

పరమాత్మ మొదట జలముల సృష్టించెను దానినుండి పంచభూత ములు సృష్టింపబడెను ఆ సలిలమధ్యభాగమున గల అంతరిక్షము నాశ్రయించి జీవుడు-ఈశ్వరుడు అను ఇరువురు దేవతలు గలరు వారిలో జీవునకు అజ్ఞానరూపమగు తంద్ర = నిద్ర గలదు ఈశ్వరునకు మాత్రము అతంద్రలేమ జీవునకు "మాయ" యనెడు ఆచ్ఛాదన కలదు ఆ ఆచ్ఛాదనమే సృష్టికర్తయైన సవితకు చుట్టూ పరివేషముగనున్నది ఈశ్వరునకు మాయాచ్ఛాదనము లేదు కావున ఈశ్వరుడు "వివస్వంతు" డాయెను వారిరువురిలో జీవుడు పృథివీరూపమయిన దేహమును ఈశ్వరుడు స్వాత్మరూపమయిన దివమును భరించియున్నారు అట్టి జీవేశ్వరుల సమష్టిరూపమైన సనాతనుడగు భగవంతుని యోగులు చూచుచున్నారు

శం భా ,- "ద్వానుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాయతే। తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్వ నశ్నన్నన్యోఽభిచాకసీతి॥" = రెండు పక్షులు చక్కని రెక్కలు గలవై ఒకే వృక్షము నాశ్రయించి యున్నవి, ఒకదాని కొకటి మిత్రములైన పరస్పరానురాగయుక్తములైన కౌగిలించుకొని యున్నవి కానివానిలో ఒకటి మధురముగా తోచు పిప్పలమును = సంసారసుఖము' ననుభవించుచున్నది మరొకటిమాత్రము సంసారసుఖము ననుభవించక ధ్యానని మగ్నమైన బాగుగా ప్రకాశించు చున్నది రాజా! పై మంత్రార్థము నే ఇపుడు నీకు వివరించి చెప్పుచున్నాను.

పరమత్మ తొలుత పంచభూతాత్మకమయిన జలమును సృష్టిం

చెను. దానినుండి భూమి, అగ్ని, నీరు, గాలి, ఆకాశము అనెడి, పంచభూతాత్మకమయిన స్థూలదేహాదికము సృష్టింపబడెను అవన్నియు జలాశయములే, ఆసలిలమే దేహాత్మరూపమయిన ప్రకృతి. దాని మధ్యభాతమే హృదయాకాశరూపమయిన అంతరిక్షము అందు జీవాత్మ పరమాత్మలు రెండును స్వయం ప్రకాశములై యున్నవి కేవల మంతరిక్షమందే యుండలేదు, జీవాత్మ, పరమాత్మరూపములగు ఆ పక్షులు ఆ వృక్షమున ఎదురెదురుగా నున్నవి తమ తిర్యగ్గమనముచే తూర్పుమున్నగు దిక్కులను అగ్నేయము మున్నగు ఉపదిశలను అవరించియున్నవి వానిలో ఒకటగు జీవాత్మ స్వాభావికమైనట్టియు, చిత్సదానందా ద్వితీయ అయిన బ్రహ్మాత్మకత్త్వమును పొందక దేహాదులనే అత్మగా భావించి భూత భౌతిక లక్షణములను కర్మఫలాను రూపమును, సుఖదుఃఖా త్మకమునకు, పృథివిని అనగా దేహాదికమును భరించియున్నది వానిలో రెండవదగు పరమాత్మ స్వయం ప్రకాశాత్మకమును, స్వాత్మరూపమును నగు దివమును భరించియున్నది నిజమారయ, పరమాత్మ తనమాయచే, తన ఆత్మను, ప్రాణాద్యనంత భేదము కలదానినిగా నొనర్చి దానిలో ప్రవేశించియున్నది అట్టి సనాతనుడైన ఆభగవంతుని యోగులు మాత్రమే చూచుచున్నారు

> ఉభౌచదేవౌ పృథి వీం దివంచ దిశశ్శుక్రో భువనం బిభర్తి
> తస్మాద్దిశః సరితశ్చ స్రవన్తి తస్మాత్సముద్రా విహితా
> మహాంతాః యోగినస్తం ప్రపద్యన్తే భగవంతం సనాతనమ్॥ 4

ఈ సమస్తము బ్రహ్మము నుండియే ఉద్భవించి, అతని యందే లీనమగుచున్నది ఎట్లనగా, బ్రహ్మ ప్రకాశము నుండియే జీవుడు–ఈశ్వరుడుయను ఇద్దరు ప్రభవించుచున్నారు వారిలో కర్మశక్తి నాశ్రయించు భోక్త్రాత్మయే జీవుడు బ్రహ్మాండమును భరించు విశ్వకర్తయే పరమాత్మ అతడే ఈశ్వరుడు వారు పృథివిని, దివమును దిశలను, ఆశ్రయించి యున్నారు ఈశ్వరునిచే భరింపబడు బ్రహ్మాండమే భువనముగా

పరిగణింపబడుచున్నది ఆ శుక్రుని నుండియే దిశలు, సరిత్తులు = నదులు సముద్రములు వెలువడుచున్నవి "కామం సముద్రమావిశ" = అను శ్రుతిలో కామములే సముద్రములుగా పేర్కొనబడినవి. ఇవ న్నియును మరల ఆ బ్రహ్మము నందే లీనమగుచున్నవి, అట్టి సనా తనుడగు భగవంతుని యోగులు మాత్రమే చూచుచున్నారు.

చక్రేరథస్యతిష్ఠన్తోఽధ్రువ స్యావ్యయ కర్మణః
కేతు మన్తం వహన్త్య శ్వాస్తం దివ్యమజరందివి
యోగినస్తం ప్రపశ్యన్తే భగవంతం సనాతనమ్॥ 5

పరమేశ్వరుడు ధ్రువుడు జీవుని రూపము దాల్చినపుడు మాత్రము అధ్రువుడే పరమేశ్వరుడు కర్మరహితుడైన జీవరూపమున యున్నప్పుడు మాత్రమే అవ్యయమైన కర్మలు గలిగి యుండును జీవాత్మగా యున్న ప్పుడు దేహ రూపమను రథమున యుండును, అయిననూ పరమాత్మ కేతుమంతుడే = ప్రజ్ఞావంతుడే జీవునకు మాత్రము అట్టి ప్రజ్ఞలేదు జీవాత్మ అయిన పరమాత్మను దేహరూపరథము యొక్క చక్రమం దున్న ఇంద్రియాశ్వములు వహింగుచుండును అయినను పరమాత్మ దివ్యుడే అనగా అప్రాకృతుడే = జరారహితుడే అట్టి పరమాత్మను ఆ అశ్వములు దివియందే వహించుచుండును సనాతనుడైన ఆ పరమాత్మను యోగులే చూచుచున్నారు

నీలకంఠ భా - ఇంకొక విషయమును ఇందుగలదు ఏమనగా "రథః స్యందన దేహయోః" అని విశ్వనిఘంటువు రథము = దేహము ఇచట రథమనగా దేహధారియైన జీవుడని లక్షణ యాచెప్ప వలసి యున్నది, జీవాత్మ అధ్రువము = వినాశము కలది అయిననూ దాని కర్మలు, కర్మఫలములు అవ్యయములు అనుభవించనిదే నశింపనివి అందుచే జీవుడు అవ్యయ కర్ముడాయెను అట్టి జీవుడు చక్రము నందు అనగా చక్రమువలె చరించు ప్రాక్తన కర్మగా యుండుటచే కర్మయందు కర్మా ధీనుడై యుండును అప్పడు ఇంద్రియములనెడి అశ్వము లు శరీరము

నెడి యాంత్రమును విషయములనెడి దేశమును చేర్చును అయినను జీవుడు కేతుమంతుడు అనగా ప్రజ్ఞావంతుడైనచో వానినా అశ్వములు పరమాత్మ చెంతకు చేర్చును దేహరథమునకు పూన్చిన ఇంద్రియాశ్వములు తనవశమున నున్నచో, అవి ఆ జీవుని పరమాత్మ చెంతకు చేర్చును. అనగా జీవుడు పరమాత్మలో లీనమగుచున్నాడు ఇంద్రియాశ్వములు తన అదుపు తప్పినప్పుడు శరీరము నశించినను, శరీరకృతమైన కర్మమాత్రము క్షీణింపదు అందుచే జీవుడు శరీరాంతరముతో తక్షణమే బంధింపబడి యుండును. పరమాత్మ మాత్రము దివ్యుడైనవాడు అనగా అలౌకికమైనవాడు "అహం ప్రత్యయ విషయము కంటె అనన్యమైనవాడు అనగా "నేను" అనెడి అహంకారము లేనివాడు అంతే కాదు పరమాత్మ ఆకలి దప్పులులేనివాడు అజరుడు అనగా వివికారములు లేనివాడు అతడెప్పుడునూ దివియందే-హృదయాకాశమునందే యుండును అతనిని యోగులు మాత్రమే చూచుచున్నారు ఇచట "కి" = జ్ఞానే అను ధాతువునకు "తున్" ప్రత్యయముచేర్చగా నేర్పడిన 'కేతుమంతుడు' అనుపదము ఏర్పడును

అ భా :- ఉత్తానపాదుని కుమారుడు ధ్రువుడు బాల్యములోనే కఠోరతపమాచరించి ధ్రువమండల మందు శాశ్వతముగా యున్నాడు చిరస్థాయి అయిన పుణ్యకర్మచే అవ్యయ కర్ముడాయెను అతని రథ చక్రమందు సర్వవ్యాపకములయిన వాయువులు అశ్వములవలె లగ్నములై యుండెను అతడు జరామరణ రహితుడై, నేటికినీ దివియందు కలడు అతడు నిష్కామతపః కర్మచే పరబ్రహ్మతుల్యుడై శాశ్వతుడుగా యున్నాడు ఈ విశేషమును గ్రహింపుము, సలిలమధ్యమున ఇద్దరు దేవులు కలరు కదా! వారిలో ఒకడు పరమాత్మ, ఇంకొకడు భోక్తాత్మకదా! భోక్తాత్మ స్వర్గనరకములను చెందు శరీర రథమును చెంది యుండును, అతడు ఇంద్రియాధారముగా ధ్రువుడై నిశ్చింతుడై

యుండుటను అతడూ అవిచ్ఛిన్నమైన కర్మల నాచరించుటచే అవ్యయక ర్ముడై యుండ మ అతనిశరీర రథముల సమూహముల సమూహము నం దు ఇంద్రియములు నివసించియుండును జ్ఞానపూర్వకమగు తృష్ణయే భోక్త్రాత్మకు చిహ్నము, అందుచేత అతడు కేతుమంతుడాయెను విష య సంబంధముచే ఆకర్షుడైన కారణమున భోగసంభృతుడై అతడు దివ్యుడాయెను. దివ్యశరీరమందుండుటచే, అతడజరుడాయెను స్వర్గ మునందు ప్రాణులు ప్రకాశించుచు క్రీడింతురు కాన దివ్యులగుదురు అందుచే భోక్త్రాత్మకూడ ఒకప్పుడు దివ్యుడేయగును అట్టిభోక్త్రాత్మను ఇంద్రియాశ్వము లు వహించుచూ భోక్తగా జ్ఞాపకము చేయును కానీ భోక్త్రాత్మమాత్రము శాశ్వతుడు కాడు

సర్వజ్ఞ భా - ఈశ్లోకమున పరమాత్మను సూర్యుడిగా చెప్పుచున్నాడు కాల స్వరూపము లయిన చక్రములు సంవత్సరము లు అట్టిరథము న నుండి జీవులకు కాలము ను తెలియజేయు జ్ఞానస్వరూపుడు సూర్యుడు, అతడు జీవులపై సదాకృపజూపువాడు కావున ధ్రువు డు = నిత్యుడు సంతతగామియైన కారణయున అతని గమనకర్మ అవ్యయము = అవిచ్ఛేదమయినది అతని రథచక్రమున బహువిధ తేజోమయములయిన ఏడు అశ్వములు లగ్నములై అతని సమీప మున యున్నవి కేతుమంతుడనగా జ్ఞానము కలవాడు అతడు సదా దివి యందే యుండును సూర్యుడే ఆత్మ.

నసాదృశ్యేతిష్ఠతిరూపమస్య। నచక్షుసాపశ్యతి కశ్చిదేనమ్।
మనీషయా ధీమనసాహృదాచ। యఏనం విదురమృతాస్తేభవంతి
యోగినస్తం ప్రపద్యన్తే భగవంతం సనాతనమ్॥ 6

పరమాత్మరూపమునకు సాదృశ్యమేలేదు. పరమాత్మను ఎప్పుడునూ కంటితో చూడలేదు. నిశ్చ యాత్మక బుద్ధితోడను సంకల్ప వికల్పా త్మకమయిన మనస్సుతోడను, యేకమయిన హృదయముతో మాత్రము చూడగలరు పరమాత్మ నెరిగిన వారు తప్పక అమృతులగుదురు. అట్టిపరమాత్మను యోగులు చూచుచున్నారు

ద్వాదశపూగాః సరితం పిబన్తో దేవరక్షితాం మధ్వీక్షన్తశ్చతే
తస్యాస్సంచరన్తీహ ఘోరమ్ యోగినస్తం ప్రపద్యన్తే
భగవన్తం సనాతనమ్॥ 7

అవిద్యసరిత్తు(నది)వంటిది ప్రాణుల జీవనమే అందలిజలము లుజ్ఞానేంద్రియములు,కర్మేంద్రియము మనోబుద్ధులు పండ్రెడు పూగములు (ప్రవాహములు) ఆనదిలో కలియును అదిసూర్యాది దేవతలచే రక్షింపబడును లౌకిక విషయములు సంసారసౌఖ్యములు ఆనదీజలమందలి మధువుగా యున్నది, ప్రతిప్రాణియును, ఆనదీజలముల త్రాగుచు, అందలి మాధుర్యమును ఈక్షించుచు = గ్రోలుచు, ఘోరమయిన ఆ సంసారనది యందే మునుగుచూ, తేలుచూ, అందే సంచరించు చుండును ఇట్లు సంచరించువారు అజ్ఞానులు జ్ఞానులు మాత్రమిందు సంచరించుచున్ననూ, ఆత్మజ్ఞానమనెడి మధువునే గ్రోలెదరు, ఇట్లు ప్రతిప్రాణిని ప్రవర్తింపజేయు భగవంతుని యోగులు మాత్రమే పొందుచున్నారు.

నీలకంఠ భా ,– రాజా! ఇంతే కాదు, పరమాత్మ నెరుగకున్నచో ప్రాణులకుసంసార పతనము తప్పదు జీవులకు పండ్రెండు పూగములు కలవు 1) చిత్తాది పూగము = దీనిచే జీవి తనచిత్తమున పరమాత్మకంటె భిన్న విషయములనే చింతించుట 2) స్మరణాది పూగము- దీనిచే లౌకిక విషయములనే చింతించును 3) శ్రోత్రాది పూగము- ప్రాపంచిక విషయములనే వినుట 4) శ్రవణాది పూగము- లౌకిక విషయములను వినుట, చూచుట 5) వాగాది పూగము–లౌకిక విషయముల గూర్చి స్తుతించుట, 6) వచనాది పూగము-ప్రాపంచిక విషయములనే మాట్లాడుట 7) శబ్దాది పూగము-లౌకికధ్వనుల నానందించుట 8) ఆకాశపూగము–నిరామయత్వము 9) ప్రాణాది పూగము–అన్నమయ ప్రాణాది షట్కోశము లందలి విషయాసక్తి

10శ్వసనాదిపూగము = జీవి ఆకాశవాయువులనే పీల్చుట 11 సంస్కార పూగము-ప్రాపంచక సంస్కారములనే అవలంబించుట 12 సుకృతాది పూగము-పునర్జన్మాది సుకృతముల నాచరించుట- ఈ పండ్రెండు పూగ ములలోజీవి అవిద్యానదిలోపడి మునుగుచు తేలుచు,జన్మపరంపరలపొం దును,-ఈ ఇంద్రియములకు శక్తుల నొసగు అధిదేవతలయిన సూర్యాది దేవతల అనుగ్రహము పొందుచు, ఆయా విషయముల వినుట, చూచుట మున్నగు సంస్కారముల నాచరించుచు, అవిద్యానదియందలి జల మనెడి జీవమును గ్రోలుచుండును పుత్రపశ్వాదికము ఆ అవిద్యానది యందలి మధురరసము, అదియే తత్ఫలము అట్టి ఫలమును ఈక్షిం చుచు జీవులెల్లరు ఆ మధురఫలమును పొందు కోరికతో, అనేక జన్మ లకు చెందిన ఊర్ధ్వ అధోమార్గములందు మరల మరల ప్రవర్తింపరాదు అనేక జన్మలలో బొందు, భార్యాపుత్ర పశ్వాది సంబంధమే సంసారము, అది మహాభయంకరమై శుక్రాఖ్యమయిన అధిష్ఠానమందు భాసమై యుండును అధిష్ఠానదేవతయై జీవులచే సంసారచక్ర భ్రమణమును జేయించు నా పరమేశ్వరుని యోగులుమాత్రమే దర్శించుచున్నారు

తదర్థమాసం పిబతి సంచిన్వన్భ్రమరో మధు
ఈశానస్సర్వభూతేషు హవిర్భూత మకల్పయత్
యోగినస్తం ప్రపశ్యన్తి భగవంతం సనాతనమ్ ॥ 8

భ్రమరము పదునైదు రోజులు కూడబెట్టిన మధువును మిగిలిన పదు నైదు దినములలో త్రాగును, అట్లే ప్రతి జీవియును పూర్వజన్మలలో కూడబెట్టిన కర్మలయొక్క ఫలములను తర్వాతి జన్మలలో అనుభవిం చును, పరమేశ్వరుడు సకల ప్రాణులందునుగల వారివారి ప్రాణాగ్ని హోత్రములకు తగినట్లు వారి వారి కర్మలననుసరించి, హవిర్భూతము ను అనగా అన్నాధికములకు కల్పించియుండెను అట్టి పరమాత్మను యోగులు మాత్రమే చూచుచున్నారు

శం భా ,- భ్రమణశీలుడగుటచే సంసారియైన జీవుడు భ్రమరముగా పేర్కొనబడుచున్నాడు తుమ్మెదవలెనే జీవుడు కూడ పూర్వజన్మలలో కూడబెట్టిన కర్మఫలమును మరొకజన్మలో అనుభవించుచున్నాడు. అది నిశ్చయము ఐహికమయిన కర్మలనుండి ఫలసిద్ధి కర్మానంతరమే జరుగును మరి కర్మ నశించును గదా! ఆముష్మికమయిన ఫలమునుండి ఫలసిద్ధి ఎట్లు జరుగును? అని శంకింతురేమో! కేవల కర్మనుండియే ఫలసిద్ధి జరుగునపుడు మీరు శంకించిన దోషము సంభవించును నిజమే కానీ కర్మఫలమయిన పునర్జన్మను, అన్నాదికమును కర్మానుసారము గా పరమేశ్వరుడొసగుచున్నాడు కాన మీరు భావించిన దోషము వాటిల్లదు, పరమేశ్వరుడు కర్మానుసారముగా సకల ప్రాణులందును, వారి ప్రాణాగ్నిహోత్రమునకు, ఇతరమయివ అగ్నిహోత్రమునకు హవిర్భూతమయిన అన్నాదికమును కల్పించెను సనాతనుడయిన అట్టి పరమేశ్వరుని యోగులు మాత్రమే చూచుచున్నారు

అ భా, - ఇంతేకాదు, "భ్రామం భామం రమతే" అను ఉత్పత్తి ననుసరించి జీవాత్మ దశలో ప్రతి ప్రాణి దేహమున ప్రవేవించి అయా కర్మ ఫలముల ననుసరించి, అనందించునట్టి క్షేత్రజ్ఞుడే ఇటభ్రమర పదముచే చెప్పబడుచున్నాడు మధువు = తేనెవలె మధురముగా తోచు విషయ రసజాతము అర్ధమాసమనగా పదునయిదు సంఖ్యకలది పృథ్వీతత్త్వమున శబ్ద స్పర్శ, రూప రస గంధములు ఐదు జలతత్త్వమున శబ్ద స్పర్శ, రూప రసములు నాలుగు, అగ్ని తత్త్వమున శబ్ద స్పర్శ రూపములు మూడు. వాయుతత్త్వమున, శబ్ద స్పర్శలు రెండు ఆకాశతత్త్వమున, శబ్దము ఒకటి మొత్తము పదునైదు-దీనినే క్షేత్రజ్ఞుడు గ్రోలుచున్నాడు అ క్షేత్రజ్ఞుడే ప్రభువయిన ఈశానుడు అతడు సకల చేతనము లందును లేక సకల శరీరములందును, ఇంద్రియములనెడి హవిస్సును కల్పించి ఎల్లప్పుడూ జగత్తునే హవిర్భూతముగా (జగద్రూపమగు అగ్నిగా) కల్పించెను అట్టి పరమాత్మయైన భగవంతుని యోగులు మాత్రమే చూచుచున్నారు

హిరణ్యపర్ణమశ్వత్థ మభిపద్యహ్య పక్షకాః
తేతత్ర పక్షిణోభూత్వా ప్రపతన్తి యథాదిశమ్
యోగినస్తం ప్రపద్యన్తే భగవన్తం సనాతనమ్ ॥ 9

అశ్వత్థవృక్షము జీవరూపము, దానికి గల పర్ణములు = ఆకులు, వేదములు, ఆ యాకులు హితమైనవి రమణీయమైనవి, కావున హిరణ్యము లాయెను ఆ వృక్షము నాశ్రయించి రెండు రకములయిన పక్షులు గలవు వానిలో కొన్ని అపక్షకములు = రెక్కలు లేనివి కొన్ని సపక్షకములు = రెక్కలు గలవి సపక్షకములైన పక్షులే జ్ఞానులు అవి ఉత్తమలోకము గల దిక్కునకు ఎగురుచున్నవి అపక్షకములయిన పక్షులే అజ్ఞానులు అవి జన్మ పరంపర నొందుటకై భూమ్యాది లోకములు గల దిక్కులను చేరుచున్నవి

శం, భా - "ఛందాంసి యస్యపర్ణాని" = జీవరూపమైన అశ్వత్థ వృక్షమునకు వేదములే పర్ణములు ఆయాకులు హితమైనవిగా రమణీయముగా నున్నవి ఆ వృక్షము నధిరోహించి రెండు రకములైన పక్షులున్నవి అవి వేద సంబంధముగల బ్రాహ్మణాది దేహముల పొందియున్నవి వానిలో కొన్నింటికి రెక్కలున్నవి కొన్నింటికి రెక్కలు లేవు "యేవై విద్వాంసస్తే పక్షిణో - యే అవిద్వాంసస్తే అపక్షకాః॥" జ్ఞానము గలవి సపక్షకములు, జ్ఞానము లేనివి అపక్షకములు అవియే మధువును గ్రోలుచూ పరిభ్రమించుచున్నవి జ్ఞానులైనన పక్షులు ముక్తిని పొందుచున్నవి అవి మాత్రమే (వారు మాత్రమే) సనాతనుడైన భగవంతుని పొందుచున్నారు అజ్ఞానులైన పక్షులకు ముక్తి లేదు,

పూర్ణాత్పూర్ణాన్యుద్ధరన్తి పూర్ణాత్ పూర్ణాని చక్రిరే
హరన్తి పూర్ణాత్ పూర్ణాని పూర్ణమేవా వశిష్యతే
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్ ॥ 10

పూర్ణమైన పరబ్రహ్మమునుండి జీవుడు, ఈశ్వరుడు అను ఇద్దరు

వుద్భవింపబడిరి జీవుడు ప్రకృతి రూపుడు ఈశ్వరుడు జగదధిష్ఠానము వీరిరువురు పూర్ణముగా వుండి వెలువడి దానియంశలుగా యుండిరి కావున పూర్ణులయిరి పూర్ణమైన పరమాత్మనుండియే ప్రాణాదులు తయారు చేయబడినవి కాన ప్రాణాదులును పూర్ణమే పూర్ణమైన పరబ్రహ్మము వల్లనే, పూర్ణము లైన జీవేశ్వరులును, ప్రాణాదులును ప్రళయమున ఉపసంహరింపబడుచున్నవి అపుడు పూర్ణమైన పర బ్రహ్మమే మిగులును అట్టి పూర్ణాత్మను యోగులు చూచుచున్నారు

> పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే
> పూర్ణస్యపూర్ణమాదాయ పూర్ణమేవా వశిష్యతే ॥

**అదః** = జగత్కారణమగు పరబ్రహ్మము, పూర్ణం = పూర్ణమనబడును ఇదం = నీవు అను అర్థము నొసగు "త్వం" అను పదముచే నిర్దేశింప బడు ప్రత్యగాత్మ స్వరూపము కూడ, పూర్ణం = పూర్ణమే ప్రత్యక్ + ఆత్మ = ప్రత్యగాత్మ, అనగా నది నుండి వెలువడిన ప్రవాహము వలె స్వస్వభావమై జీవరూపమున వెలువడిన వస్తువు పరమాత్మ తన మూడు పాదములతో ఊర్ధ్వము నధిష్ఠించి, నాల్గవ పాదమును ప్రకృతి రూపమున బ్రహ్మాండమును ప్రతిష్ఠించెను అదియే ప్రత్యగాత్మ, "త్రిపాదూర్ధ్వముదైత్పురుషః పాదోఽస్యేహాభ్వాత్పునః" = శ్రుతి దీనికి ప్రమాణం తత్ + త్వం = అను పదార్థములు పూర్ణములెట్లగును అను శంకకు సమాధానము ,- అవిచ్ఛిన్నమై, అఖండమైన, పూర్ణమైన పరబ్రహ్మమే, జీవుడు, ఈశ్వరుడు, అను రూపములతో రెండుగా వెలువడెను అందుచే అవి రెండునూ పూర్ణములే తత్ + త్వం అనెడి ఆత్మతో నున్నట్టియు పూర్ణుడగు పరబ్రహ్మము యొక్క, పూర్ణరూప మును స్వీకరించి, తత్ + త్వం = తత్త్వం అనెడి రెండు పదార్థముల యొక్క శోధనము గావించబడెను అదియే పూర్ణమైయున్నది కావున పూర్ణమేవా వశిష్యతే

తస్మాద్ద్వైవాయు రాయాతస్తస్మింప్రయతస్సదా ।
తస్మాదగ్నిశ్చ సోమశ్చ తస్మించ ప్రాణ అతతః ॥ 11

ఆ పరమాత్మ నుండియే వాయువు అగ్ని సోముడును ఉద్భవిల్లినవి. వానినుండి ప్రాణులకు ప్రాణములు, దేహేంద్రి యాదులు లభించినవి మహాప్రళయము న ప్రాణాదులు వాయుర్వగ్ని సోములందు లీనమగును వారు పరమాత్మ యందు లీనమగుదురను విషయమును యోగులు తెలిసుకొందురు

సర్వమేవ తతోవిద్యాత్ తత్త్వక్తుం నశక్నుమః
యోగినస్తం ప్రపద్యన్తే భగవంతం సనాతనమ్ ః 12

నీలకంఠ భా + అగ్నిమిశ్రభాష్యము -

"యదితివాయేతస్యమహతోభూతస్యనామ భవతి" = మహాభూతమైన పరమాత్మకు ''తత్" అను నామము కలదు ఆ పరమాత్మ నుండియే ఈ సమస్తమూ బహిర్గతమైనదని తెలుసుకొనవలయును ఆ పరమాత్మయు వాచామగోచరుడు అతని మహిమ కార్యానుమేయమే కానీ ఇట్టిదని తెలిసికొనలేము

అపానంగిరతిప్రాణః ప్రాణం గిరతి చంద్రమాః
ఆదిత్యోగిరతే చంద్ర మాదిత్యం గిరతే పరః
యోగినస్తం ప్రపద్యన్తే భగవంతం సనాతనమ్ ॥ 13

శం భా ,- కావున రాజా! ఆత్మదర్శనోపాయమైన యోగమును గూర్చి చెప్పెదను వినుము, మనస్సునకు చంద్రుడు అధిదైవతమగుటచే మనస్సు చంద్రమ శబ్దముచే చెప్పబడుచున్నది బుద్ధికి సూర్యుడు అధిదైవతమగుటచే ఆదిత్య శబ్దముచే బుద్ధి చెప్పబడుచున్నది సమాధి వేళలో అపానవాయువు ప్రాణవాయువులో లీనమగును ప్రాణము చంద్రుని యందు = మనస్సు నందు లీనమగును చంద్రరూపమైన మనస్సు ఆదిత్యరూపమైన బుద్ధిలో లీనమగును బుద్ధి పరమాత్మలో లీనమగును

అందుచే సమాధ్యవస్థలో యున్నయోగి స్వాభావికమైన చిత్సదా నందా ద్వితీయమైన బ్రహ్మపై యుండును ఇదియే యోగము, ఇందలి "గి ఓ" యను పదమునకు తీసముగుట అని యర్థము

ఏకపాదం నోత్క్షిపతి సలిలాద్ధం స ఉచ్చరన్
తంచేత్సం తత మూర్ధ్వాయన, మృత్యుర్నామృతం భవేత్
యోగినన్తం ప్రపద్యన్తే భగవంతం సనాతనమ్ ॥ 14

పరమాత్మకు గల నాలుగు పాదములలో మూడు పాదములు మీదుగా (ఊర్ధ్వముగా) వ్యాపించియుండును అది యోగులకే గోచరము నాల్గవ పాదము క్రిందికి వ్యాపించియుండును అదియే జీవుడను నామమున విఖ్యాతమైయున్నది అది పరమాత్మ ప్రభావముచే సలిలరూప సంసారము ఉంటె వెలుపలనే అంతటను ఆవరించి ఊర్ధ్వముగా సంచరించును దానిని పరమాత్మ ఉపసంహరింపడు అతడు తన మాయచే సకల శరీర జీవులందును సంచరింపజేయును కావున ఆ పాదము సంతతమగుచున్నది పరమాత్మ ఆ జీవాఖ్య పాదమున ఊర్ధ్వముగానున్న మూడు పాదముల చెంతకు చేర్చుటకు జీవుడే యుండడు అందుచే ఆ జీవునకు చెందిన మృత్యువును అమృతమును అనగా మోక్షములను ప్రదర్శించుటకే పరమాత్మ ఆజీవాఖ్య పాదము ను ఉపసంహరింపడు పరమాత్మకు జీవాత్మరూపమైన పాదమొకటియును, చిత్సదానందాద్వితీయమగు పాదములు మూడున్ను కలవు ఇట్టి రూపమును యోగులు మాత్రమే చూచుచున్నారు

సీల భాష్యము – "యత్సాక్షాదపరోక్షాత్" అను సూక్తి ప్రకారము పరబ్రహ్మనిత్యమును, అపరోక్షముగను వున్నది అపరోక్షమైన పరబ్రహ్మమును చూచుటకు యోగమేల? చెప్పెదను వినుము పరమాత్మ హంస వంటి హంస, హంసకు వలె జీవాత్మకూ శరీరము కలదు పరమాత్మయైన హంస (జీవాత్మ రూపమున) శరీర వృక్షము నధిష్ఠించిననూ,

శరీరము తో సంబద్ధము కాదు ఎందుకనగా, "సోఽయమాత్మా చతుష్పాత్"-పరమాత్మకు నాలుగు పాదములు కలవు 1. జాగ్రత్ 2 స్వప్న 3) సుషుప్తి 4 తురీయావస్థలు కలవు ఆ నాల్గింటిలో ఒకటగు తురీయపాదము ను కానరానియదు. జీవ రూపమున పరమాత్మ అపరోక్షమైననూ, తురీయపాద రూపమున పరోక్షమగుటచే దానిని కాంచుటకు యోగము అవసరమేకదా !

అంతేకాదు పరమాత్మ (హంస) నిర్విశేషము ను అతి గంభీరమగు సలిలము కంటె (జలరూప ప్రకృతి కంటె) ఉత్+చరన్ = ఉచ్చరన్ = మీదుగనే, చరన్ = పాదత్రయముతో సంచరించుచున్నాడు ఆ మూడు పాదములు విశ్వ, తైజస ప్రాజ్ఞ నామ భేదములతో ఒప్పుచున్నవి పై వాని కంటె విలక్షణమైనదే తురీయపాదము "శివమద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా సవిజ్ఞేయః" తెలిసికొనదగినదై యున్నది విశ్వ తైజస ప్రాజ్ఞ లనెడి పాదములున్న చైతన్యమగు బ్రహ్మ పదార్థముయొక్క అనుబంధము లేనిదే, తమ కార్యముల నాచరించుటకు సమర్థములు కావు అట్టి చైతన్యాని, పరోక్షమగుటచే, చూచుటకు యోగమవసరము

అంతే కాదు లోకమున కానవచ్చు మృత్యువు, అమృతము రెండున్నూ జ్ఞాన కృతములే ఆ రెండును జ్ఞానము కలిగినతోడనే, కాలత్రయమందుండ నేరవు ఆలోచింపగా జీవరూపాంశమైన బ్రహ్మము నిత్యాపరోక్షము

అయిననూ ఉపాధి విశిష్టమైన రూపముతో పరోక్షమే అంతకంటె నికృష్టరూపముతో అనగా జీవరూపముతో మాత్రము పరోక్షము కాదు అపరోక్షమే యగును అందువల్ల జీవరూపము న అపరోక్షమును చైతన్య రూపమున, పరోక్షమునగు పరమాత్మ దర్శనమునకై యోగమవసరము

అంగుష్ఠమాత్రః పురుషోన్తరాత్మ లింగస్యయోగేన సయాతి నిత్యమ్।
తమీశమీడ్యమనుకల్పమాద్యం పశ్యంతి మూఢా నవిరాజమానమ్।
యోగినస్తం ప్రపద్యన్తే భగవంతం సనాతనమ్ ॥ 15

పరమాత్మయే పూర్ణపురుషుడు అతడే సకలవస్తువు లందును అంతరాత్మగా గలడు అతడు అంగుష్ఠమాత్రుడు అనగా అంగుష్ఠమాత్రమగు హృత్పుండరీకమున యుండునాడు ఆ పరమాత్మ లింగ శరీర సంబంధముచే, జీవాత్మయై నిత్యము ఇహపర లోకముల బొందు చున్నాడు సకలమును శాసించుటచే ఈశానుడగుచున్నాడు అతడే అందరిచే స్తుతింపబడు చున్నాడు ప్రత్యక్ చైతన్యమై ప్రకాశించు ఆ పరమాత్మను యోగులు తప్ప మూర్ఖులు చూడలేరు (లింగ శరీరము = పంచప్రాణములు పంచ కర్మేంద్రియములు పంచ జ్ఞానేంద్రియములు, మనోబుద్ధులే లింగ శరీరము)

అసాధనావాపి సనాధనావా।సమానమేత ద్దృశ్యతే మానుషేషు
సమానమేత దమృతస్యేతరస్య। ము క్తాస్తత్రమధ్వఉత్సంసమాపుః
యోగినస్తం ప్రపద్యన్తే భగవంతం సనాతనమ్ ॥ 16

జీవులలో కొందరు శమాది సాధన సంపత్తి కలిగియుందురు కొందరు అసాధనులు అయినను బ్రహ్మపదార్థము నందరు మానవులందును సమానముగనే చూడబడుచున్నది ఈశానవచ్చు సంసారము కాన రాని మోక్షము అను రెండు, ముక్తులందును, ముక్తులు కాని వారి యందును, సమానముగనే యుండును వారిలో ముక్తులు మాత్రమే పూర్ణానందమైన పరమాత్మను పొందుచున్నారు మధ్వః = బ్రహ్మరహస్యము యొక్క, ఉత్సం = ఉత్కర్షను పరాకాష్ఠను = పూర్ణానంద మైన పరబ్రహ్మమును పొందుచున్నారు

ఉభౌలోకౌ విద్యయావ్యాప్యయాతి। తథాహుతం చాహుతమగ్నిహోత్రం
మాత్రేబ్రాహ్మలఘుతా మాదధీతః ప్రజ్ఞానంస్యాన్నామధీరా లభన్తే
యోగినస్తం ప్రపద్యన్తే భగవంతం సనాతనమ్ ॥ 17

ఇహపరలోకముల వ్యాపించి యున్న పరమాత్మను, యోగులును జ్ఞాను లును, జ్ఞానము చే పొందుచున్నారు, అందుచే వారు పొందు అగ్ని హోత్రము హుతము కాకున్నను, ఆత్మజ్ఞానముచే అహుతమే యగు చున్నది జీవుడు జ్ఞానియైన కారణమున బ్రహ్మవిద్యనీకు లఘుత్వము ను = మర్త్యభావము చేకూర్చదు జ్ఞానులు ధీరులు కావున ప్రజ్ఞామ లను నామమును పొందుచున్నారు

నీల,భా - ఇంతేకాదు బ్రహ్మప్రాప్తి జరిగినచో, సర్వఫలా వ్యాప్తి యు కృత కృత్యతయు చేకూరును, ఎట్లనగా మనో బుద్ధి చిత్తాహం కారములనెడు అంతః కరణ వృత్తి బ్రహ్మాకార మైనచో, అదియే బ్రహ్మవిద్యయనబడును అట్టి విద్యలభించిన వాడే మానవుడు "అహ మే వేదంసర్వోఽస్మి" = నేనే ఈ సమస్తము-అను జ్ఞానము కలుగును అదియే సర్వాత్మ్య కారణమైన అంతఃకరణ వృత్తి ఆ అంతఃకరణ వృత్తిచే మానవుడు ఆత్మలోకము, అనాత్మలోకములనెడి రెంటినీ వ్యాపించియున్న పరమాత్మను చక్కగాతెలుసుకొని, స్పష్టముగా ప్రకా శింప చేయును పైనపేర్కొనినట్లు మానవుడు తనమనో బుద్ధిచిత్తము లను, పరమాత్మయందే లగ్నమొనర్చనేని వాని అహంకారము నశిం చును అపుడే వాని యంతఃకరణమూ బ్రహ్మాకారమగును, అపుడే వాడు విద్యావంతుడగును పరికింపగా ప్రారబ్ధ కర్మావష్టబ్ధ దేహుడైన మానవుడు అజ్ఞాన దశలో అనాత్మలోకమును, జ్ఞానదశలో ఆత్మలోక మును పొందుచున్నాడు

మానవుడు విద్వాంసుడై ఉభయలోకములందును సంచరించు నప్పుడు వాని అగ్నిహోత్రము అహుతమైనను హుతమే యగును (వాడు యజ్ఞయాగాదుల నాచరించినను, ఆచరింపకున్నను, జ్ఞానాగ్ని లోవాని ప్రారబ్ధ కర్మహుతమై నశించును "జ్ఞానాగ్ని దగ్ధసర్వ కర్మాణి" -గీత "అహంమహానస్మి" = నేను మహత్తును = బ్రహ్మమును అగు

చున్నాను అను నీ[బాహ్మావాక్కు లఘుత్వమును అనగా నీచత్వము పొందకుండుగాక! "అహందాసోస్మి" నేను దాసుడనగుచున్నానను నీచ వాక్కునుచ్చరించరాదు ప్రజ్ఞానం బ్రహ్మ బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి పరబ్రహ్మకున్ను బ్రహ్మవేత్తకున్ను "ప్రజ్ఞానం" అను పేరుకలదు

ఏవంరూపోమహానాత్మ సపావకం పురుషోగిరన్ యోవైతం
పురుషోవేద తస్యేహర్థో నరిష్యతే యోగినస్తం ప్రపద్యన్తే
భగవంతం సనాతనమ్॥ 18

ప్రజ్ఞాన పురుషుడైన జ్ఞానియే మహాత్ముడైన పురుషుడు. అతడే అగ్ని ని తనలో ఉపసంహరించుకొనును, అపురుషుడే పరమాత్మ అతడే జీవులలో వున్న జీవాత్మ, జీవాత్మ పరమాత్మలు తానేయని ఎరిగిన జ్ఞానిలో గల ఆత్మచైతన్యమెన్నడును నశింపదు అట్టి ఆత్మచైతన్య మే పరమాత్మయని యోగులు మాత్రమే తెలిసికొనుచున్నారు (నరిషశీ తే = నశింపదు)

యస్సహస్రం సహస్రాణాం పక్షాన్ సంతత్య సంతపేత్ మధ్యమే
మధ్య ఆగచ్ఛేదపి చేత్స్యాస్మనోజవః యోగినస్తం ప్రపద్యన్తేభగ
వన్తం సనాతనమ్॥ 19

పరమాత్మతా నొక్కడే అయినను కోట్లకొలది జీవరాసులను సృష్టించి వానిని తనవిగా చేసుకొనుచున్నాడు వానిలో తానుచేరుచున్నాడు వారిని తరింప చేసినను తాను తాపమును చెందడు మధ్య మధ్యను వచ్చి వానిలో తాను చేరినను మరల మరల స్వస్థానములు చేరుచుండును అయినను వానికి నాశము లేదు అపరమాత్మ మనో జవుడు కావున అట్లు చేయుచున్నాడు అతడే గరుడరూప ప్రకృతియన్ని, అతని మహ త్వమును యోగులు మాత్రమే పొందుచున్నారు.

శం భా ,- పరమాత్మ ఒకడే అయినను, పదిలక్షల సపక్షములను అనగా అనంత కోటి జీవరాసులను సృష్టించి, వానిని తనపక్షములుగా

అనగా సన్నిహితులు గా చేసి వానిలో చేరుచున్నాడు ఆజీవరాసులు ఎంత దూరమున యున్నను వానిలోతాను చేరుచున్నాడు పరమాత్మ కు దూరమనునది లేదు కోటి కల్పముల కాలమైనను విరాట్పురుషుడు నశింపడు జీవులు మాత్రము నశింతురు.

నదర్శనేనిష్ఠతిరూపమస్య। పశ్యంతి చైనంసువిశుద్ధ సత్త్వాః
హితో మనీషి మనసాన తప్యతే। ఏ ప్రవ్రజేయు రమృతాస్తే
భవన్తి॥ 20

పరమాత్మ స్వరూపము చూపుల కందదు పరమ పవిత్రాంతః కరణులైన విశుద్ధసత్తులే ఆ రూపమును చూడగలరు. ఆ రూపమును చూచినవారే హితులును, మనీషులును అగుచున్నారు వారు మనస్సులో నైనను పరితాపము చెందరు అట్టి వారే నిజముగా సన్న్యాసులై అమృతులగుచున్నారు వారే పరమాత్మను చూచుచున్నారు

గృహ్ణంతి సర్పా ఇవగహ్వరాణి। స్వశిక్షయాస్వేన వృత్తేనమర్త్యాః
తేషు ప్రముహ్యంతి జనావిమూఢాః। యోగినస్తం ప్రపద్యన్తే
భగవన్తం సనాతనమ్॥ 21

భగవత్తత్త్వము తెలియని వారే విమూఢులు వారే మరణశీలురైనమృత్యులు వారు గురువుల చెంతజేరి, చక్కని శిక్షణను పొందినను తమ సహజ ప్రవృత్తిని విడిలేక మోహము పొందుచున్నారు అట్టి వారు పరమాత్మను దర్శించుటకు ప్రయత్నించినను, ఇంద్రియ సర్పములు కర్ణము మున్నగు ఇంద్రియము లనెడి గుహల (పుట్టలనుండి) బైటకు వచ్చి, వారిని గ్రహించి పీడించుచున్నవి అందుచే వారు (నరులు) ముగ్ధులై భయంకర సంసారమున పడుచు, మునుగుచు తమ జీవిత మార్గమును మోహముతో నింపుచూ, ముక్తులు కాలేరు జ్ఞానులైన యోగులు మాత్రము, ఇంద్రియ పశులు గాక, పరమాత్మను గాంచి తరించుచున్నారు.

శం భా - విషయ విషయముల గ్రోలిన జనులు (జీవులు) తెలివి

తప్పిన కారణమున, లౌకిక విషయముల నేమాత్రము ఎరుగకున్నారు ఇంద్రియ సర్పము లొసగిన, ఇంద్రియ భోగము లన్నియు విషతుల్య ములే అందుచేతనే అని మోహహేతువులై, జీవులను చంపుచున్నవి సంసార రూపమగు భవము (సంసారము) ఇంద్రియములచేతను, విషయ వాసనల చేతనే ప్రాప్తమగు చున్నది అందు వలనవాటియందు విరక్తి పొందవలెను

నీలకంఠ భా – వంచ కులతోటి సహవాసము నష్టదాయకము అంతే కాదు సన్న్యాసమును స్వీకరించియు మానవులు వంచకుల సంగతిని వీడవలెను మరణ శీలురైన మర్త్యులు ఎల్లప్పుడు లౌకికులే వారు తమ సహజ ప్రవృత్తిచే మద్య, మాంస మగువ సేవాదులనెడి గహ్వరము లను అనగా పాముల నాశ్రయించుచున్నారు పాపాత్ములు, వారుచేసిన పాప కృత్యములను కానరానియక్క సర్పములు పరులను కాటువేసి బిలములో దాగునట్లు, యుంటున్నారు అందుచే వారెంత గురువుల శిక్ష ణను పొందినను విషయము లలో మునిగి మూఢులగుచున్నారు,

నాహంసదాఽసత్కృతస్స్యాం నమృత్యుః । నచామృత్యురమృతంమే
కుతస్స్యాత్। సత్యానృతే సత్యసమాన బంధే సతశ్చయోని
రసతశ్చైక ఏవ। యోగినస్తం ప్రపద్యన్తే భగవన్తం సనాతనమ్॥ 22

"నేనే పరబ్రహ్మము" అనుజ్ఞానము పొందినవాడే సత్కృతుడు వానికి మృత్యువులేదు పరమాత్మ తత్త్వమెరుగని వాడే అసత్కృతుడు వానికితప్పక మృత్యువుకలదు మృత్యువు కలవారికి అమృతమనలేదు కాన వానికి అమృత ప్రసక్తి యుండనేరదు, సత్యము "సత్" అనబడును అనృతము అసత్తనబడును పరికింపగా సత్యానృతములు రెండున్ను, సత్యమైన పరమాత్మతో సమానబంధము కలవని తెలియుచున్నది. "సత్" అనగా శాశ్వతమైన బ్రహ్మపదార్థము, దానియొక్క యోనియే మహద్బ్రహ్మమైన ప్రకృతి. అట్టి ప్రకృతియే "సత్" అయిన పరబ్రహ్మ మునకు జీవరూపమును దాల్చుటలో, "యోని" అనగా కారణ

మగుచున్నది అసత్తనగా అశాశ్వతమైన ప్రపంచము . దానికిని, అస లైన ప్రపంచమేర్పడుటకున్ను, పరమాత్మయొక్క మహద్బ్రహ్మ అయిన ప్రకృతియే కారణము ప్రకృతి పరమాత్మ యొక్క వికృతి కావున సదసత్తుల రెంటికినీ ఏకమైన పరబ్రహ్మమే మూలకారణమని యోగులు తెలుసుకొనుచున్నారు

దుర్గ టార్థప్రకాశక భాష్యము – ఈ శ్లోకమందలి "అహం" శబ్దముచే క్షేత్రజ్ఞరూపమైన పరమాత్మ చెప్పబడుచున్నాడు ఆ పరమాత్మ సదా ఉదాసీన రూపుడగుటచే, బాహ్యభోగాదులచే, సత్క్రృతుడు కాలేడు పుష్కరపలాశమనగా తామరాకు, దానిపై బడిన నీరు, దానిపైనుండి యు, దాని కంటకయే యుండును అటులనే పరమాత్మ జీవులలో వున్నను అతనికి జీవులకుగల బాహ్యభోగాదులచే సంబంధము లేదు కావున నిర్లిప్తుడైయుండును అందుచేత పరమాత్మకు సంసారరూప మృత్యువు లేదు అమృత్యువైన జన్మయును లేదు పరమాత్మ సర్వా తీతుడు అందరికి మోక్షమొసగును కావున అతనికి అమృతముతో సంబంధమెట్లుండును? సత్యానృతము లు, మోక్షబంధములు, ఆ యోగికి లేవు, సత్యమైన పరబ్రహ్మయే యేకాశ్రయము వానికి సత్ మైన పరబ్రహ్మముతో సమానమైన అనుబంధము కలదు చూడగా, జీవుడు బద్ధుడు వానికే మోక్షమవసరము, బద్ధుడు కాని పరమాత్మకు బంధమోక్షములు లేవు, "సత్" అనగా మోక్షము అసత్తనగా సంసా రము ఈ రెంటికినీ కారణాత్మయే యోని అనగా ఆదికారణము, బంధ మోక్షములు కలిగించుట కారణాత్మయొక్క క్రీడ కారణాత్మ ఎవని ననుగ్రహించునో, వాడే తనను ముక్తునిగా తలంచును ఆ కారణాత్మ ఎవని ననుగ్రహించడో, వాడే తనను బద్ధుడుగా భావించును, అందుచే జీవుడు నిధి, ధ్యానములచే ప్రయత్నించును చూడగా, జీవప్రకృతి త్రాటితో కట్టిన కర్రబొమ్మ వంటిదని తెలుసుకొనవలసి యున్నది సత్యము అనగా ఓంకారరూప పరబ్రహ్మమని చెప్పవచ్చును

శేఖాభా ("సౌతానేఽస్మచ్చిదానందాద్వితీయః పరమాత్మ" అన్నుభావము తో అహర్నిశల్ము నెమెల్గిగినవాడుః సదా పతుష్కృతుడే యగును అతనికి మృత్యువు (జనన మరణ రూపసంసారము) వుండదు అజ్ఞాని మృత్యు సాపేక్షుడగుటచే, మృత్యు వు యొక్క అభావ ప్రసక్తియే వానికి లేదు. కావున వానికి అమృతత్వమెట్లు ప్రాప్తించును? "మృత్యుర్నాస్త్య మృతం కుతః" = చూడగా అధిష్ఠానమైన పరబ్రహ్మము ఒక్కటియే అదియే పరమార్థ సత్యమయె "రజ్జువునందు సర్పము వలె అధిష్ఠానమైన పరమాత్మను అనుబంధించి సత్యానృతములు రెండును సమానముగా యున్నవి సత్ = ఉన్నది దాని ధర్మము సత్యము, న + సత్ = అసత్ = లేనిది ఇట సత్ అనునది సత్యపదము చేతను, అసత్ అనునది అనృతపదము చేతను చెప్పబడినది సదసత్తులు సత్యానృత ము లు రెండును పరమాత్మకు చెందినవే కావున సత్యమనబడుచున్నది ఎట్లనగా, సృష్టికంతటికీ పరమాత్మయొక్క మహద్బ్రహ్మయే (మూల ప్రకృతియే) యోనిగా యున్నది అందుచే సృష్టికి అది మూలకారణ మగుచున్నది జీవులందు పరబ్రహ్మ సత్ = ఉన్నది అనుకొనుట లౌకికము అట్టిలౌకికమైన సత్తునకు పరమాత్మ యొక్క మూలప్రకృతి యైన యోనియే మూలకారణము కావున లౌకికమైనసత్తు అనగా జీవాత్మరూపమైన సత్మము, సత్యమునే(పరబ్రహ్మమునే) అనుబంధించి యున్నది

న + సత్ = అసత్ = లేకుండుట, అదియే అనృతము జీవులందు, పరంబ్రహ్మశుక్తి (ముత్యపుచిప్ప) యందు రజతము వలెవ్యావహారి కమై జీవరూపమున యున్నది కానీ నిజముగా లేదు "మత్స్థాని సర్వ భూతాని నచాహంతే ష్వవస్థితః" అను గీతావాక్యమే ఇందులకు ప్రమా ణము "ఏకమే వాద్వితీయంబ్రహ్మ" అను శ్రుతియే జీవులందు పర బ్రహ్మయొక్క అసత్తునకు అనాగా వ్యావహారికమై న "లేకుండుటకు" కారణము, అమూర్తమయిన ఈఅసత్తే అనృతము, అదియును సత్య

మునే (బ్రహ్మమునే) ఆశ్రయించి యున్నవి కావున సదసత్తులు అన్నగా వ్యావహారికములైన సత్యానృతములు రెండును ప్రత్యక్షముగా సమముగా అనుసంధించి యున్నవి అందుచే సత్యసమాను బంధులైనవి ఆత్మకు కారణము మృత్యువు కావున దేహయుక్తప్రతి జీవియు త్వమ్ = నీవు = జీవుడు తత్ = అపరమాత్మ అనెడి తత్త్వజ్ఞానము పొందినచో మృత్యు విముక్తుడగును పైన చెప్పబడిన తత్త్వజ్ఞానము చేతనే మృత్యువునకు వినాశము కలదు కానీ ఆత్మకు నాశము లేదని తెలియుచున్నది పైన చెప్పినట్లు వ్యావహారికములైన సత్యానృతములు సత్యమునే అనుబంధించి ప్రవర్తించుచున్నవి అట్టి సత్యానృతానుబంధియైన సనాతన పరబ్రహ్మను యోగులు మాత్రమే చూచుచున్నారు

"సత్యంచా నృతంచ సత్యమభవత్" అని శ్రుతి కూడా దీనినే తెలుపుచున్నది

నసాదునానోత అసాధునావా। సమానమేతత్ దృశ్యతే మానుషేషు
సమానమేత ధ్దమృతస్య విద్యా। దేవం యుక్తో మధుతద్వై పరీ
ప్సేత్ యోగ్గినస్తం ప్రపద్యన్తే భగవంతం సనాతనమ్ 23

బ్రహ్మవేత్తలు సత్కర్మచే ఉన్నతులుగను దుష్కర్మచే నీచులుగను కానేరరు సామన్యమానవులు మాత్రమే కర్మల ననుసరించి ఉత్తములుగను, అధములుగను అగుచున్నారు చిద్రూపమైన బ్రహ్మమునకును, బ్రహ్మవేత్తకును, కైవల్యము మాత్రము సమానమే యుక్తుడు (యోగి) మాత్రమే మధువును అన్నగా పరబ్రహ్మమును పొందును అట్టి పరబ్రహ్మమును యోగులు మాత్రము కాంచుచున్నారు

నీలకంఠభాష్యము – బ్రహ్మవేత్తకు కర్మస్పర్శలేకుండును అదియే బ్రహ్మవిద్యాఫలమూ (అసాధునావాపి నసాధునావా) అను 16 వ శ్లోకము పరబ్రహ్మమునకు అసంగత్వము చెప్పబడినది ఇందు, బ్రహ్మ

వేత్తకు పాపస్పర్శలేదను చున్నారు దేహాభిమానులైన మనుష్యులందే మాత్రము ఉచ్చనీచములైన కర్మఫలములుండును బ్రహ్మవేత్త బ్రహ్మమే కావున వానికి కర్మలననుసరించిన ఎక్కువ తక్కువలు లేవు

నాస్యాతి వాదా హృదయం తాపయంతి। నానధీతం నాహుతమగ్ని
హోత్రమ్ మనో బ్రాహ్మీ లఘుతామదధీత। ప్రజ్ఞాంచాస్మైనామ
ధీరాలభన్తే। యోగినస్తం ప్రపద్యన్తే భగవంతం సనాతనమ్॥ 24

నిందావచనముల అతివాదమందురు అట్టినిందావాక్యములు బ్రహ్మవేత్తల హృదయముల నొప్పింపజాలవు వేదాధ్యయనము చేయలేదే, అగ్నిహోమము చేయలేదే అనడి విచారములు, లేశమంతైనను బ్రహ్మవేత్తలకు లేవు వారు బ్రహ్మీభూతులు కావున వారి మనస్సుకు ఏవిధమయిన లఘుత్వమునూ (తక్కువ తనము) లేదు వారుఆప్తుల కష్టములగాంచియు విచారింపరు వారుధీరులు వారికట్టిప్రజ్ఞను భగవంతుడు చేకూర్చును అట్టివారే పరమాత్మను చూచుచున్నారు

ఏవం యస్సర్వభూతేషు ఆత్మానమను పశ్యతి
అన్యత్రాన్యత్రయుక్తేషు కింసశోచేతత్తః పరమ్॥ 25

సర్వభూతములందును ఇట్లు ఆత్మతత్త్వమును గాంచువారికి శోకమోహము లుండవు అసక్తులైన వారికిని, కర్మాసక్తులకును మాత్రమే శోకమోహములు కలవు (తత్రకోమోహః కశ్శోక ఏకత్వమనుపశ్యతః) సకల ప్రకృతి యందును ఏకత్మమునుగాంచు యోగికి శోకమోహము లెక్కడివి?

యథోదపానే మహతి సర్వతస్సంప్లుతోదకే
ఏవం సర్వేషువేదేషు ఆత్మానమను జానతః" 26

దాహముతో బాధపడువాడు జలపూర్ణములైన తటాకాదుల కేగి స్నానపానమూ లొనర్చుకొని తృప్తుడగును అట్లే సర్వ వేదములందును

చెప్పబడిన ఆత్మతత్త్వమెరిగినవాడు ఆత్మను దర్శించి తృప్తుడగును

అంగుష్ఠమాత్రః పురుషోమహాత్మా నదృశ్యతేఽసౌహృది సన్నివిష్టః
అజశ్చరో దివారాత్ర మతంద్రితశ్చ సతంమత్వా కవిరాస్తే
ప్రసన్నః॥ 27

శం భా - ఇందు జీవాత్మయొక్క ధ్యానప్రకారము చక్కగా చెప్ప బడు చున్నది ఎట్లన ఆకాశాది దేహాంతమైన, జగములను సృష్టించిన కారణమున, పరమాత్మ మహాత్ము డాయెను అతడు హృత్పుండరీకమున అంగుష్ఠమాత్ర పరిమాణుడై యుండియును చిత్సదానందాత్మతో నెవరికిని కానరాడు జన్మాది శూన్యుడైనను, చరాచరాత్ముడై జగన్నియమమున, దివారాత్రముద్యుక్తుడై యుండును అపుడు జీవాత్మగా గోచరించును అన్నమయాది కోశపంచకమునుండి నిష్క్రాంతుడై జాగరూకుడై, యుండును క్రాంత దర్శియైన కవి పరబ్రహ్మమును సర్వాంతరాత్మగా సర్వాధికారిగా తలచును

అహమేవస్మృతో మాతా పితాపుత్రోఽస్మ్యహంపునః
ఆత్మాహమపి సర్వస్యయచ్చనాస్తి యదస్తి చ॥ 28

బ్రహ్మవేత్త బ్రహ్మభావము పొంది, వామదేవాదుల వలె తనను అపరోక్షుని గావించుకొనుచు, తనయనుభవము ను, తనసార్వాత్మ్యమును ఇందు ప్రదర్శించుచున్నాడు ఓయీ! నేనే అనగా (పరబ్రహ్మమే) మీకందరికిని తల్లిని, తండ్రిని నీపుత్రులందరును నేనే, పెక్కేల, సకల ప్రాణిజాతములో నున్న పరమాత్మనే నేను అతీతానాగతమేదియు నాకంటె భిన్నముగాలేదు భూత భవిష్యద్వర్తమానములు నేనే

పితామహోఽస్మిస్థవిరః పితాపుత్రశ్చభారత
మమైవయూయమాత్మస్థానమే యూయంనమేవయమ్॥ 29

పైశ్లోకమున ఆది భౌతికమైన పిత్రాదిభావము ప్రదర్శింపబడెను, ఇపు

డాధిదై వికమగు పిత్రాది భావము ప్రదర్శించి దొడగెను అయ్యా! నేనే పితామహుడను ఇంద్రాదులకంటె వృద్ధుడను అనాదిసిద్ధమైన పరమాత్మను నేనే ఇంద్రాదులకు తండ్రియైన హిరణ్యగర్భుడ నేనే. పుత్రుడనునేనే మీరందరు నాయత్మలోనే కలరు. పరమ త్మబుద్ధితో చూచినచో మీరెవ్వరును నాఆత్మలోలేరు నేనును మీలోలేను

ఆత్మైవస్థానం మమజన్మచాత్మా ఓతప్రోతోఽహ మజరప్రతిష్ఠః
అజశ్చరో దివారాత్ర మతంద్రితోఽహం మాంవిజ్ఞాయ కవిరాస్తే
ప్రసన్నః॥ 30

సమస్తప్రపంచమునకు ఆత్మయే స్థానము సమస్తము ఆత్మనుండియే జన్మించుచున్నది గుడ్డయందలి పడుగు, పేకదారములవలె ఆత్మయే అంతటను వ్యాపించియున్నది ఆ పరమాత్మకు జరామరణములు లేవు. అదిజన్మరహితమై, రేబవళ్లు అంతటను వ్యాపించినది అట్టి ఆత్మను ప్రసన్నుడైన కవి ఒక్కడేతేలును కొనుచున్నాడు "సభగవః కస్మిన్ ప్రతిష్టితః? స్వేమహిమ్ని" (ప్రశ్నే ఉ) = భగవంతుడు తన మహిమయందే ప్రతిష్ఠితుడు అజరః = అప్రత్యుత స్వభావము గలది అందుచే అజర ప్రతిష్ఠితుడు.

అణోరణియాన్ సుమనాః సర్వభూతేషుజాగ్రతి
పితరం సర్వభూతేషు పుష్కరే నిహితం విదుః॥ 31

పరమాత్మ అణువు కంటె అణువైనవాడు రాగద్వేషాదులు లేనివాడు కావున అతడు సుమనస్కుడు అతడు సర్వప్రాణులందు చైతన్య రూపుడై వున్నాడు అతడే సకల ప్రాణులకును తండ్రియనియు, సకల జీవుల హృదయ పద్మము లందును కలడనియు, బ్రహ్మ వేత్తలు చెప్పిరి

శం భా – నిత్యశుద్ధముక్త భావ మీశమాత్మనా
భావయన్ షడింద్రియాణి సంనియమ్య నిశ్చలః

అస్తివస్తు చిద్ఘనం జగత్ప్రసూతి కారణం
ననశ్వరం తదుద్భవంజగత్తమాను దంచయత్
తత్వదైక వాచకం సదామృతం నిరంజనం
చిత్తవృత్తిదృక్సుఖం తదస్మ్యహంతదస్మ్యహం॥

సకలజగదుత్పత్తి కారణమైన బ్రహ్మవస్తు ఒకటి కలదు అది చిద్ఘనము అనశ్వరము . తత్పదము నుండి ఉద్భవించిన ఆ శక్తితమస్సును తొలగించును ఆ బ్రహ్మ వస్తువు నిత్యము, శుద్ధము, బుద్ధము, ముక్తమునై సకల సృష్టికి ప్రభువుగా వున్నది ఆ పరబ్రహ్మమును చేరదలచిన యతడు షడింద్రియము లను నిగ్రహించి ఆ పరమాత్మను మనసా ధ్యానించవలెను "ఓం తత్సత్" అను మూడు పదములును బ్రహ్మమునే సూచించుచున్నవి అదియే సదా అమృతమును, నిరంజనమును చిత్తవృత్తిచే చూడదగినదియునై, మోక్షము నొసగుచున్నది పై ఆత్మ విషయము నెరిగినవాడు బ్రహ్మవేత్త కావున ఆ బ్రహ్మ పదార్థము 'నేనే, నేనే" అని తెలునుకొనుము

అరవ అధ్యాయం సంపూర్ణం



# ఫలశ్రుతి

శ్రీ సనత్సుజాతీయము బ్రహ్మజ్ఞాన ప్రతిపాదకము దీనిని పఠించి, మననము చేసికొనిన వారు తప్పక బ్రహ్మజ్ఞానులగుదురు వారికి మృత్యుభయము లేదు వారు ఆప్తకాము లగుదురు. వారు జీవ

న్ముక్తు ౧గుదురు  అర్జునమిశ్రులు తన  వ్యాఖ్యలో  శ్రీ సనత్సుజాతీయ మును ముగించి ఈ విధంగా వ్రాసిరి

''సనత్సుజాతీయగిరోగభీరా గభీరవస్తు ప్రతిపాదనీయాః
మదీయ టీకా వినిరుచ్యమానా
హరన్తు తాపాన విదుషాం హృదిస్థాన్ ॥'

సనత్సుజాతీయుని వాక్యములు అతి గంభీరములు  అవి గంభీరమైన బ్రహ్మవస్తువును ప్రతిపాదించుచున్నవి వాటి విషయముల గ్రహించుటకై నేను టీకను వ్రాసితిని  అవి విద్వాంసుల హృదయతాపముల హరించుగాక !

హరిః ఓమ్
ఓం తత్సత్

